# రేఖలు

## యువభారతీయుల కవితాసంకలనం

ప్రచురణ




రిజిష్టర్డ్ నెం: 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

REKHALU

An Anthology of Poetry

By Yuvabharathi Members



యువభారతి

ప్రచురణ : 73

ప్రథమముద్రణ :
దుర్మతి ఉగాది
5 ఏప్రిల్, 1981

ప్రతులు : 1,200

ముఖచిత్రం : సుధామ

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్ గూడ, హైదరాబాద్

ముఖచిత్ర ముద్రణ :
గీతా ఆర్ట్ ప్రింటర్స్
హైదరాబాద్

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాద్-500 003
లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్రసారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్, హైదరాబాద్-500 001

వెల. రూ. 3/-



# యువభారతి
## సాహిత్య సమావేశాలు

సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతర సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో గడచిన పదహారు సంవత్సరాలుగా కృషి చేస్తున్న సంస్థ 'యువభారతి'. మనిషిలో అంతర్లీనంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కావడానికి యువభారతి ప్రతీనెలా మొదటి, మూడు ఆదివారాలలో సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో సాయంత్రం 5 నుంచి 8 గంటల వరకూ సాహితీ సమావేశాలు నిర్వహిస్తున్నది. ఈ సమావేశాలకు సహృదయులందరూ ఆహ్వానితులే!

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3




# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదిహేడేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటె ఇతరమైన సాత్త్వికసాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకూ 73 ప్రచురణలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకుపైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ హూనుకొన్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీ మిత్ర పథకంలో దాదాపు 6500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. యువభారతి భవిష్య నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా దాదాపు 725 మంది, భారతీభూషణులుగా 70 మంది చేరారు

ఉడుతాభక్తితో మేముచేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషా ప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

హైదరాబాదు
5 ఏప్రిల్ 1981.

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు : యువభారతి.




# మామాట

యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి చేయూతనిస్తున్న సహృదయులకు దుర్మతి ఉగాది శుభాకాంక్షలు. యువభారతి సభ్యులు తమ రచనలను పుస్తక రూపంలో అందించే ప్రయత్న పరంపరలో ఇది ఏడవది. ఇంతవరకు వీచికలు, అక్షరాలు, స్వరాలు, వేడి వెలుగులు అనే కవితా సంకలనాలను అందివ్వగలిగినాము. యావదాంధ్ర దేశంలో మా యువభారతి సాహిత్యోద్యమానికి సహకారాన్ని అందిస్తున్న సాహితీ మిత్రుల కవితాసంకలనం-'ఉషస్సు',-కథా సంకలనం-'కథా వాహిని' (రెండు భాగాలూ) ప్రచురించినాము.

మహాకావ్యాల్లోని మంచి పద్యాలకు వ్యాఖ్యానాలు వెలయించటం, ప్రసిద్ధ సాహిత్యాచార్యుల ఉపన్యాసాలను పుస్తకంగా మలచటం, అనేక రంగాలలో నిష్ణాతులైన వారి వ్యాసాలను సేకరించి కదంబంగా ప్రచురించటంవంటి కార్యక్రమాలే కాకుండా, యువభారతి అప్పుడప్పుడు తన సభ్యుల్లోని సృజనాత్మక రచనోత్సాహానికి మారాకు హత్తే ప్రయత్నం కూడా చేస్తుంటుంది. పేరు మోసిన సాహితీ స్రష్టలతో పోటీ పడాలనే ఉత్సాహం కంటె, ప్రజాబాహుళ్యానికి తమ రచనా వ్యాసంగాన్ని ప్రదర్శించాలనే కుతూహలమే ఇప్పుడు మీ చేతుల్లో ఉన్నటువంటి ఈ కవితా సంకలన రూపకల్పనకు తొలిరేఖ. ఈ కవితా సంకలనం 'రేఖలు'లో పన్నాలుగు మంది కవితలున్నాయి. ఆధునిక యుగంలో కనిపించే కావ్యవస్తు వైవిధ్యం ఈ కవితల్లో పొడకట్టుతున్నది. భావానికి స్వచ్ఛందత ఉండాలని నమ్మేవాళ్లు ప్రకటనారీతికి కూడా స్వేచ్ఛ ఉండాలని నమ్మటంలో సారస్యమూ ఉంది; ఔచిత్యమూ ఉంది. ఏ వ్యక్తికో ఏ సంఘానికో నచ్చిన భావాలనే నచ్చే తీరులోనే వ్రాయాలనీ ప్రకటించాలనీ కొలతల గీతలు గీయటం అంత సమంజసం కాదేమో. అయితే తన భావాలను తనకు నచ్చిన తీరులో ప్రకటించి

ప్రచార చేసుకునే అవకాశం ప్రజాస్వామ్య వ్యవస్థ కల్పిస్తుంది. చెప్పనివ్వండి. వ్రాయనివ్వండి. నిగ్గుతేల్చేది కాలం. ఏది ఎదలను కదిలిస్తుందో ఏది నిలుస్తుందో ఎవరికీ తెలియదు ఇది తెలిసిన రచయిత ఎప్పుడో కాని పుట్టడు. అట్లాగని ఊహలు ఆగవు. రచనలు ఆగవు. సహృదయులు ఊరుకోరు.

ఈ రేఖల్లో కొన్ని సరళంగా ఉన్నాయి. కొన్ని వక్రంగా ఉన్నాయి. కొన్ని మనసు చుట్టూ, కొన్ని భాష చుట్టూ, కొన్ని సంఘం చుట్టూ అల్లుకుని ఉన్నాయి. కొన్నిట్లో మనసు పొంగిపోతుంటే భాష నిశ్చలంగా ఉంది కొన్నిట్లో భాష నృత్యంచేస్తుంటే భావం చూస్తూకూచున్నది. కొన్నిట్లో సంఘం కనిపిస్తే కొన్నిట్లో వ్యక్తే కనిపిస్తున్నాడు. మొత్తానికి అందరికీ తమ ఊహలకు వర్ణాలు తొడుగాలనే ఆకాంక్ష మిక్కుటంగా ఉన్నది. భవిష్యత్తుపైన ఆశలున్నాయి. ఈ కవుల దృష్టిలో గతం ఒక ప్రయోగం. వర్తమానం ఒక అనుభవం. భవిష్యత్తు ఒక మహత్వాకాంక్ష. ఈ కవుల్లో ఐదు దశాబ్దాలను చూసిన వాళ్ళు ఉన్నారు; స్వాతంత్ర్యోదయం తర్వాత ఉదయించిన వాళ్లూ ఉన్నారు.

ఈ కవితాసంకలనం ఈ ఉగాది సందర్భంగా వెలువరిస్తూ యువ భారతిని మరింత ప్రయోజనాత్మకమైన సంస్థగా రూపొందించాలని సభ్యులు కృషి చేస్తున్నారు. సమాజంలో మంచి భావాలను నిర్మాణాత్మకంగా ప్రచారం చేయాలనే ఉత్సాహంతో కార్యకలాపాలు కొనసాగించడానికి ఉద్యుక్తులవుతు న్నారు. సహృదయులు ఎప్పటిలాగే వారి కృషిని ప్రోత్సహించి ఆదరిస్తారనీ ఆశిస్తున్నాము.

ఈ కవితాసంకలనానికి సంపాదకత్వం వహించిన మా ప్రధాన సంపాద కులు డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారికి అభివందన పరంపరలు. ఈ కవితా సంకలన ప్రచురణకు బాధ్యత వహించిన మా సంస్థ ఉపాధ్యక్షులు డా॥ తిరుమల శ్రీనివాసాచార్యగారికి, కార్యదర్శి శ్రీ అయల సోమయాజుల నాగేశ్వరరావు గారికి, సహకార్యదర్శి శ్రీ గోళ్ల కుమారస్వామి నాయుడు గారికి అభినందనలు.

ముఖ చిత్రాన్ని మలచిన శ్రీ 'సుధామ'కు మా అభినందనలు.

హైదరాబాదు

5 ఏప్రిల్ 1981

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు : యువభారతి



# వెలుగు పొడి రాలుస్తున్న చుక్కలు

ప్రతి ఉగాదికీ సరికొత్త కవితా సంకలనం ప్రచురించటం యువభారతీయుల సంప్రదాయం. దుర్మతినైనా సుముఖంగా చేసుకోగల్గింది కవితా మంత్రం అని ఈ అక్షర తపస్వులకు తెలుసు. మినీ కవితలు తమ యుగాన్ని ప్రకటించిన తరమిది. మినీకవితకొక అర్థం, రూపం, ప్రయోజనం, పరమార్థం ఉన్నాయని భావిస్తున్న తరుణమిది. ఆ కవితకు పరిమాణమే ప్రమాణమైనా, ప్రవృత్తి ప్రధాన గుణం. తెలుగులో మంచి మినీకవితల్లా మన్నికకెక్కగల్గే కొన్ని కవితలు ఇందులో ఉండటం హర్షదాయకం.

యువ భారతీయులకు కవిత్వాన్ని ఎన్ని మలుపులు తిప్పుకోవలెనో తెలుసు; ఎన్ని నడకలు నడిపించాలనో తెలుసు; లక్షణ వైవిధ్యంతో పాటు లక్ష్య వైవిధ్యాన్నిగూడా వీరు గౌరవిస్తారు. విప్లవ జ్వాల, ప్రక్కనే విలాస హేల పదం కలుపుతూ, కదం త్రొక్కుతూ నడుస్తుంది. సూక్తి ముక్తావళి వెంట ఛలోక్తి తారావళి మెరుస్తుంది. తెగబడి తిట్టడానికి పూనుకున్నా వీరి వాక్కు ఔచిత్యం ఓర్పు నేర్పుతుంది. నినాదానికి నిదానం నేర్పేసిందు దనం ప్రతి పాటలో పల్లవిగా నిలుస్తుంది సహజంగా వీరు ఆలోచనాశీలురు. ఆవేశం వచ్చినా ఆలోచింపచేసేటట్లు పలుకుతారు.

శబ్దార్థాల అనుబంధం హృదయచ్ఛందమంటారు ఒకరు, కవిత కోసం మనసు కాదు, మనసు కోసమే కవిత అని నిజసూక్తిని ప్రకటిస్తారు మరొకరు. ఆలోచనాలోచనాలను తెరిచి అనంత విశ్వంలోని విషమ విషయాలను వివేచించింది ఒక కవి దృష్టి బెడిసిన నింగికాపురాన్ని నిలబెట్టుకొనేందుకు శాంతి ఒప్పందంమీద సంతకం పెట్టుతూన్నది మరొక కలం. లక్ష్మణ దేవర నవ్వులా కథా కవితను వినిపించింది ఒక వెన్నెలవాణి. తరతరాల అంతరాలను అంతం చేయాలని పంతం పట్టింది ఒక పట్టుదల. పగిలిపోయిన రక్త కణాల్లో తెల్లబడిన ఎర్ర జెండాలను చూసింది ఒక మైక్రోస్కోపిక్ కవిత. 'నాకు పని చేసే హక్కు ఉంది' అని నడుం కట్టింది ఒక కార్మికగళం. 'పేష్కు

చదివే వాడికంటే అమ్ముకొనేవాడు నయం' అంటూ జీవితంలోనుంచి పుట్టింది చిసింద్రీలాంటి సూక్తి. 'మానవాళి చరిత్రే సంపూర్ణాసంపూర్ణం' అంటూ శ్రీ శ్రీ ని చూసి చిందులు వేసింది మరో చిన్ని కవిత. నేటి రంగస్థలానికి రంగు పూస్తూన్న కుంచె కలంలా చిత్రిస్తోంది అక్షరగవాక్షం మీద. ఎడారి దిబ్బల్లో బంగారు పండిస్తున్నాడు మరో ప్రపంచపు మరోకృషీవలుడు ఒక నర చైతన్యం కవితామూర్తిలో విశ్వరూపాన్ని దర్శించి విప్లవ పాంచనాజ్యన్ని పూరించాలి అంటే మరో ఎక్స్‌రే కిరణం చైతన్యస్ఫూర్తిలోని సుప్తాస్థికలను సమీక్షించే మట్టివాసన మనస్తత్త్వాన్ని పసికట్టి ప్రక్షాళించాలని ప్రబోధిస్తున్నది.

కవితను రాజకీయాల కటకటాల నుండి విడిపించే స్వేచ్ఛావాతావరణంలో ఒకరు చెప్పిన పాఠాలు కాకుండా పల్లె వేసిన పదాలు కాకుండా క్రొత్తగొంతుతో కొత్త పాటలు పాడేటట్లు చేయాలని ఈ రోజు సాహిత్యలోకంలో ప్రయత్నాలు జరుగుతున్నాయి. కవిత కవితగా బ్రతకాలంటే కమెంట్ మెంట్ అనే కవోష్ణ రుధిరధార అవసరమని కొందరు అరుణ వాదాలను వినిపిస్తున్నారు రక్తమే శరీరం కాదు, వరిసిన దానికంటే రక్తం యెక్కువైనా ప్రాణానిం సుఖం లేదు; రక్తాన్ని రూపొందించేది అన్నసారం; అమృతమైనా జాత్యన్నంకంటే రుచికరంగా ఉంటుందా ? జాతీయత ఆత్మీయతతో సంవరిస్తేనే కవితకు శాశ్వతత్వం కలుగుతుందని విముక్తి వాదులు వివేచిస్తున్నారు.

నేటి సమస్య కవిత ఎర్రగా ఉందా, నల్లగా ఉందా, తెల్లగా ఉందా అని కాదు. అసలు కవిత కవితలా ఉందా ? అని. కోల్పోయిన ఏదో అనుభూతి కోసం కోటి గొంతులు వేదనతో మూల్గుతున్నాయి. మరోసారి పుడమితల్లి పురిటినొప్పులు పడుతోంది. మరో సృష్టికోసం తొలి వేగుచుక్క తొంగలిస్తోంది. ఈ ప్రభాతంలో ఈ వాస్తవానికి సాక్షుగా వెలుగుపొడి రాలుస్తూన్న చుక్కలు ఎన్నెన్నో ! వాటిల్లో ఈ కవితలు కొన్నేమో !

ఏమో ! సహృదయులు చూసి గుర్తిస్తే అప్పుడే తొలిసంజ వెలుగు రేకలు ! !

ఉగాది : 5-4-981 డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం.



# ప్రేరణ

''యువ భారతి'' సభ్యులలో పద్నాలుగు మంది కవితలను ''రేఖలు'' అనే కవితా సంకలనంగా దుర్మతి ఉగాది సందర్భంలో తెలుగు పఠితృలోకానికి సమర్పించ గలుగుతున్నందుకు మాకెంతో సంతోషంగా ఉంది.

ఇది యువ భారతీయుల ఐదవ కవితా సంకలనం. డెబ్భై మూడవ ప్రచురణ. ఐదవ వార్షికోత్సవం సందర్భంగా యువభారతి అందించిన 'పీచికలు' అనే కవితా సంకలనం సహృదయులను కదిలించింది. వ్రాసింది నలుగురయినా పలువురి ప్రశంసాపీచికల నందుకున్నారు. ''పీచికల'' కవులు. అష్టమ వార్షికోత్సవం సందర్భంగా సృష్టించిన మరో కవితా సంకలనం ''అక్షరాలు'' నక్షత్రాల్లా పదమూడు కలాలు సాహితి విహాయసంలో సరికొత్త కాంతులను విరజిమ్మినవి.

ఈ కవితా సంకలనంలోని ప్రత్యక్షరం యువభారతీయులకు ఉత్సాహాన్నీ ఉల్లాసాన్నీ అందించింది. ప్రమాదీచ ఉగాది సందర్భంగా మాసభ్యులు ప్రమోదంతో ''స్వరాలు'' సాహిత్య జగత్తుకు కానుకగా అందించినారు. ఇందులో ఇరవైనాలుగు గళాలు తమ స్వరాలను వినిపించాయి. రౌద్రి ఉగాది సందర్భంగా వెలువరించిన ''వేకి వెలుగులు'' కవితా సంకలనంలో పాల్గొన్న పద్నాలుగు మంది కవులు యథాశక్తి తమ వేకి వెలుగును విరజిమ్మ ప్రసరించినారు. ఇది యువ భారతీయుల కవితా సంకలనాలలో ఐదవది. పీచికలుగా కదలి, అక్షరాలను దిద్ది, స్వరాలను పలికించి వేకి వెలుగుల విరజిమ్మిన యువ భారతీయులు ఇప్పుడు ఈ రేఖా చిత్రాలను మీ ముందుంచు చున్నారు.

ఈ కవితా సంకలనంలో చక్కని కృషి చేసిన కవులతో పాటు తొలి సారి ధైర్యంగా కలం పట్టి వ్రాసిన వారు కూడా ఉన్నారు.

ఈ కవితా సంకలనాన్ని వెలువరించటానికి ప్రేరణను కల్గించి రచనలన్నింటినీ ఓపికతో పరిశీలించి తగిన సలహాలిచ్చి రేఖలకు మెరుగులు దిద్దిన మా సంస్థ అధ్యక్షులు డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారికి, విలువైన సూచనలు చేసిన సంస్థ కన్వీనర్ శ్రీ వంగపల్లి విశ్వనాథంగారికీ, మా కృతజ్ఞతలు.

మేము కోరిన వెంటనే అంగీకరించి ఈ సంకలనానికి ముందుమాట వ్రాసి, మమ్మలను ఆశీర్వదించిన మా ప్రధాన సంపాదకులు డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం గారికి మా హార్దికాభివాదాలు.

మా అభ్యర్థనను మన్నించి ఈ కవితా సంకలనాన్ని తమ అమృత హస్తాలతో ఆవిష్కరించి మమ్మల్ని ప్రోత్సహించి ఆశీర్వదించిన ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి, కళాప్రపూర్ణ డా॥ దాశరథిగారికి మా నమస్సుమాంజలులు.

కలంతోపాటు కుంచెను కదిలించగల కళాకారులు శ్రీ సుధామ. ఈ సంకలనానికి ముఖ చిత్రాన్ని ముద్దుగా కూర్చడంతో పాటు దీనిని విజయవంతంగా వెలువరించడంలో అడుగడుగున తమ అండదండ లందించిన వీరికి మా హృదయపూర్వక కృతాజ్ఞతలు. ముఖ చిత్రకల్పనకు వన్నెలు కూర్చి తగు సలహాలిచ్చిన కళా హృదయులు శ్రీ శీలా వీర్రాజుగారికి మా ధన్యవాదాలు. తమ కవితలను అందించడమే కాకుండా, ప్రూఫులు దిద్ది పూర్ణంగా సహకరించిన మిత్రులు శ్రీ టి. కె. విజయకుమార్ గారికి మా కృతజ్ఞతలు.

అల్ప వ్యవధిలో అచ్చు కార్యక్రమాన్ని చేపట్టి, అందంగా ముద్రించి ఇచ్చిన శ్రీ పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్ వారికి, ముఖ్యంగా అధినేత శ్రీ శ్రీనివాస్ గారికి మా ధన్యవాదాలు సకాలంలో బ్లాకులను తయారు చేసి అందించిన 'గురు బ్లాక్ మేకర్సు వారికి మా కృతజ్ఞతలు. ముఖచిత్రాన్ని రంగుల్లో ముద్రించి ఇచ్చిన గీతా ఆర్ట్ ప్రింటర్స్ అధినేతలు శ్రీ బోస్‌గారికి మా నమస్కారాలు.

మేము కోరిన వెంటనే సకాలంలో తమ కవితల్ని అందించి సహకరించిన కవి మిత్రులందరికీ మా అక్షర కృతజ్ఞతలు సహృదయుల ప్రోత్సాహం, మిత్రుల సహకారం, పెద్దల ఆశీస్సులూ ఉంటే ప్రతి ఉగాదికి ఒక కవితా సంకలనాన్ని వెలువరించాలని మా సంకల్పం.

మా కార్యక్రమ నిర్వహణలో ప్రత్యక్షంగానేకాక పరోక్షంగానూ మాకు తమ సహకార ఫలాలను అందిస్తున్నారు ఎందరో మహానుభావులు, వారందరికి మా వందనాలు.

తెలుగు సహృదయలోకం ఈ కవితా సంకలనాన్ని ఆదరించి, ఆస్వాదించి, ఆశీస్సారభాలు అందచేస్తుందని ఆశిస్తూ —

*ఉగాది శుభాకాంక్షలతో —*

భవదీయులు,

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు

గోళ్ళ కుమారస్వామి నాయుడు.




# కవుల గురించి రేఖా మాత్రంగా

## డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి

జననం 1930. స్వస్థలం :- మహబూబ్‌నగరం. కవిసమయాలు అనే అంశంపై పరిశోధనచేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్ పట్టా పొందారు. హైద్రాబాద్ పోస్టుగ్రాడ్యుయేట్ కాలేజీలో రీడర్‌గా ఉన్నారు. వీచికలు, అక్షరాలు, స్వరాలు, వేడివెలుగులు కవుల్లో ఒకరు.

## కె. వి. కామేశ్వరరావు

వయసు 34 సంవత్సరాలు. స్వస్థలం:- భీమునిపట్నం. ప్రస్తుతం హిందూస్తాన్ మెషీన్‌టూల్స్, హైదరాబాద్‌లో ఉద్యోగం. సంగీతం, సాహిత్యం అభిరుచులు. చలం, రాచకొండ, డా॥ పి. శ్రీదేవి అభిమాన రచయితలు. ఉషస్సు కవుల్లో ఒకరు.

## గోళ్ళ కుమారస్వామి నాయుడు

"స్వరాలు", "ఉషస్సు" "వేడి వెలుగులు" కవుల్లో ఒకరు స్వస్థలం బెల్లంగోవిందుపల్లె. చిత్తూరు జిల్లా. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి ఎమ్. ఏ. పట్టభద్రులు. ఉద్యోగరీత్యా హైద్రాబాద్‌లో నివాసం.

## కె. బి. చౌదరి

జననం 20-7-1954, జన్మస్థలం:- మంగనూరు, మహబూబ్‌నగర్. విద్య : బి.ఎస్.సి, బి.ఇ.డి, రెండేళ్లకుపైగా మహబూబ్‌నగర్ జిల్లా పరిష దున్నత పాఠశాలల్లో జీవశాస్త్రోపాధ్యాయునిగా పనిచేసారు ప్రస్తుతం ప్రభుత్వ

చీఫ్ ఇంజనీర్, నీటిపారుదలశాఖ కార్యాలయం, ఎర్రమంజిల్‌లో జూనియర్ అసిస్టెంట్‌గా ఉన్నారు. 'వస్తుంది ఉగాది' కవితతో ఒరిస్సాలో 18 వ ఏట రచన ప్రారంభించారు.

## అక్కిరాజు జనార్దనరావు

వయసు 45 సంవత్సరాలు. జన్మస్థలం ఖమ్మం జిల్లా. విద్య బి. ఏ. జర్నలిజంలో డిప్లొమా. రాష్ట్ర ప్రభుత్వ వైద్య ఆరోగ్యశాఖలో ఉప సంపాదకులుగా పని చేస్తున్నారు.

ఇంగ్లీషు, ఉరుదు రచనలను తెలుగులోనికి అనువదించి ప్రచురించారు. కేంద్ర సాహిత్య అకాడమీ కొరకు ప్రముఖ ఉరుదు కవి నజీర్ అక్బర్‌బాదీ జీవిత చరిత్రను తెలుగులోనికి అనువదించారు. సంగీతం అంటే చాల ఇష్టం.

## అయ్యదేవర పురుషోత్తమరావు

జననం 1933. స్వస్థలం ఎర్రుపాలెం, ఖమ్మంజిల్లా. విద్య బి. ఏ. ప్రస్తుతం స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్‌లో ఉద్యోగం. అక్షరాలు, స్వరాలు, వేడివెలుగులు కవుల్లో ఒకరు.

## నాగినేని భాస్కరరావు

జననం 1-11-1949. స్వస్థలం:- బనిగండ్లపాడు, ఖమ్మంజిల్లా, విద్య: యం.బి.బి.ఎస్. ప్రస్తుతం నాగినేని నర్సింగ్ హోమ్‌ను మధిరలో నిర్వహిస్తున్నారు అక్షరాలు. స్వరాలు, మేం, వేడివెలుగులు కవుల్లో ఒకరు.

## అల్లంరాజు రాధాకుమార్

కలం పేరు: రాధాయి. జననం 1943 అనకాపల్లిలో.

విద్య : బి. ఏ. ప్రస్తుతం సిండికేట్ బ్యాంక్ హైదరాబాద్‌లో పని చేస్తున్నారు.

" 'అక్షరాలు' ద్వారా కవిత్వంలో అ ఆ లు దిద్దుకుని 'స్వరాలు'లో గానాలు వినిపించి 'రేఖలు' లో రూపుదిద్దుకోబోతున్న కవితా సాధకుడిని. కలంలో ఇంకిపోయిందనుకున్న కవిత్వానికి మళ్ళీ జీవం పోసే ఆస్కారాన్ని

కలిగించిన యువభారతికి, నా కవిత్వంలో కవి చచ్చిపోలేదని మీరు భావిస్తే అందుకు మీకూ కృతజ్ఞతలు.''

## వి. బి. లక్ష్మి

జననం :- 1951.

బాపు బొమ్మలన్నా, భరతనాట్యం అన్నా ఇష్టం.

అక్షరాలు, స్వరాలు కవుల్లో ఒకరు.

## టి. కె. విజయకుమార్

జననం:- 9-4-1952.

కొత్తలంక ముమ్మడివరం తాలూకా తూర్పుగోదావరి జిల్లా. విద్యాభ్యాసం ముమ్మడివరం, కాకినాడ, హైదరాబాద్‌లో నృపతుంగ ఉన్నత పాఠశాలలో తెలుగు అధ్యాపకులుగా పని చేస్తున్నారు. ఔత్సాహిక నాటక రంగంలో పది సంవత్సరాల అనుబంధం. ''కనబడుటలేదు'' ''ప్రదర్శన'' మరొకరితో కలసి ''పెద్ద మనుషులు-చిన్న మనుషులు'' నాటకాలు వ్రాసి T. V., రేడియో రంగస్థల ప్రదర్శన లిచ్చారు. ఆంధ్రనాటకరంగానికి పోషించే శక్తి ఉండే అంకితం కావాలన్న కమిట్‌మెంట్ ఉంది.

## శారదకుమార్

అసలు పేరు: యస్.వి యల్.యన్. శర్మ. జననం:- 1957. అడవుల దీవి, గుంటూరుజిల్లా. విద్య: బి ఏ. వృత్తి:- ఉద్యోగం. ''చిన్నతనం నుండి సాహిత్య రంగంలో అభిరుచి. మనిషిని మౌలికంగా ఆలోచింపచేసే సాహిత్యం అతనిని, తద్వారా సమాజాన్ని తప్పక మారుస్తుంది'' అని విశ్వాసం.

## మాచర్ల శ్రీనివాసరావు

జన్మస్థలం హైదరాబాద్. జననం జూలై 1964. ఇంటర్‌మీడియట్ రెండవ సంవత్సరం చదువుచున్నారు.

''నా కవిత మీ హృదయంలో ఓ చిన్న ప్రకంపనం కలిగిస్తే చాలు, నా కవిత కలలు పండినట్లు, నవత చిగుర్లు తొడగినట్లు. కొత్తదనాన్ని ఆశిస్తూ కవిత వ్రాస్తాను.''

## డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

జననం:- 1-1-1942. స్వస్థలం:- నారాయణపురం, సిరిసిల్ల తాలూకా కరీంనగర్ జిల్లా. సికిందరాబాద్ సర్దారు పటేలు కాలేజీలో ప్రధానోపన్యాసకులుగా పనిచేస్తున్నారు.

"తెలుగులో గేయనాటికలు" అనే అంశంపై పరిశోధనచేసి డాక్టరేట్ పొందినారు. స్వరాలు, వేడివెలుగులు కవుల్లో ఒకరు.

ఉదయరాగం, జీవనస్వరాలు, కిరణాలు-కెరటాలు అనే కావ్యాలను రచించారు. "నారాయణరెడ్డి సాహితీ మూర్తి" అనే గ్రంథాన్ని త్వరలో వెలువరిస్తున్నారు.

## సుధామ

అసలు పేరు అల్లంరాజు వెంకటరావు.

జననం 1951. "తెలుగు అభ్యుదయ కవిత్వంలో భావచిత్రాలు" అనే సిద్ధాంతవ్యాసంతో ఉస్మానియా విశ్వవిద్యాలయంనుండి ఇటీవలే యం. ఫిల్. పట్టా పుచ్చుకున్నారు. రెండు సంవత్సరాలు కరీంనగర్‌లో బిషప్ సాలమన్ జూనియర్ కాలేజీలో తెలుగు లెక్చరర్‌గా పని చేసారు. ప్రస్తుతం ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో ట్రాన్స్‌మిషన్ ఎగ్జిక్యూటివ్ (డ్యూటీ అఫీసర్‌గా) గా పని చేస్తున్నారు. వీచికలు, అక్షరాలు, స్వరాలు, మేం కవుల్లో ఒకరు. కార్టూన్‌లు, సాహిత్యం, చిత్రకళ అభిమాన విషయాలు.




# ఇవీ రేఖలు

1. డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
   * 1+1= * దారి ఏది * ఆకాంక్ష * పూజ

2. కె. వి. కామేశ్వరరావు
   * చెట్టుచెప్పింది * అనుభూతి చిత్రాలు * పూలు వలపులు
   * మౌనం * బ్రతుకు బాటలో * గతం—ఆగతం.

3. గోళ్ళ కుమారస్వామి నాయుడు
   * క్షరం-అక్షరం * ముక్కలు * చుట్టూతా * వీళ్లని నమ్మకు

4. కె. బి. చౌదరి
   * రవి-కవి * వస్తోంది ఉగాది * తీరనిదాహం * తొలకరి

5. అక్కిరాజు జనార్దనరావు
   * జీవితం * ఆకలి * అంతరాలు * అధికారి

6. అయ్యదేవర పురుషోత్తమరావు
   * వయసు * లోకం

7. నాగినేని భాస్కరరావు
   * నేడు-రేపు * పగిలిన నెత్తురు

8. అల్లంరాజు రాధాకుమార్
   * గళానికి సంకెళ్లు, * న్యాయం ఉరేసుకుంది * అగ్నిపూలు
   * విప్లవం-విరహం

9. వి. బి. లక్ష్మి
* ప్రజామోహిని * స్లో-పాయిజన్ * ఏం చేసుకోవడానికి

10. టి. కె. విజయకుమార్
* కవితార్ద్రత * సంపూర్ణాసంపూర్ణం

11. శారదకుమార్
* నాంది * నీ శక్తి ఎక్కడుంది * అంధకారానికి స్వస్తి
* మెట్లు-పాట్లు

12. మాచర్ల శ్రీనివాసరావు
* మరో ప్రపంచం * ధైర్యం * నాలో చైతన్య జ్వాల
* బ్రతుకు * స్వాగతం * నే...* దుఃఖం *మనిషి
కోసం * ప్రబోధం

13. డా॥ తిరుమల శ్రీనివాసాచార్య
* ఎవరది? * గుండె గులాబి * సమరం సాగిద్దాం

14. సుధామ
* బుర్ర * వలపు * గురికోసం * కొటే లుక్
* డియర్ బుక్

## డా. ఇరివెంటి కృష్ణమూర్తి

### 1 + 1 = 1

నిదురా కలా
ఏరూ అలా
వీటిని విడదీయడం ఎలా !

మనిషి - మమత
అనుభూతి - కవిత
ఏనాటిదో వీటి జత !

శబ్దం అర్థం
హృదయం ఛందం
ఏనాటిదో ఈ అనుబంధం !



## దారి ఏదని...!

నా దారి ఏదని
ఏ మనిషి నడిగినా
తన దారినే వాడు చూపిస్తాడు

చిలుక తాను నేర్చిన
పలుకులే చెబుతుంది గానీ - నీ
సమస్యలకు
సమాధానం చెప్పగలదా ?

గొర్రె తన కాపరి ముల్లు గర్రకున్న
గజ్జెల సవ్వడినే అనుసరిస్తుంది గానీ
తన గమ్యం తెలుసుకునే బుర్ర
దాని కెక్కడిది ?



## ఆ కాం క్ష

విత్తులా ఉన్నవాణ్ణి
వృక్షంలా ఎదగలేనా ?

దివిటీలా ఉన్నవాణ్ణి
దివాకరుణ్ణి కాలేనా ?

సన్నజాలులా ఉన్నవాణ్ణి
స్రవంతిని కాలేనా ?

మాటలా ఉన్నవాణ్ణి
మహాకావ్యాన్ని కాలేనా ?

నాదంలా ఉన్నవాణ్ణి
నవరాగం కాలేనా ?

అవకాశం చేతులు సాచి
ఆర్ద్రంగా పిలిచిననాడు.

o o o o

ఊరికి దీపం బడి
మనిషికి దీపం నడవడి
మంచిని కోరేవాళ్లకు
లోకం దేవుని ఏలుబడి



## పూజ

పూజావేళకు పూలుతేలేదని
సేవకుణ్ణి హింసించినవాడు
భక్తుడుకాదు
మనిషి అసలేకాదు
అన్నార్తుని ఆదుకున్నవాడు
ఆస్తికుడు
అబద్ధాలకు దూరమున్నవాడు
ఆస్తికుడు

మంచితనమే దైవంగా నమ్మేవాడికి
గుడిలోని పూజారి నడవడితో ఏమి పని ?
గుండెలో లేని దేవుడు
గుడిలో ఉన్నాడని నమ్మేవాడు
అందరికంటె పెద్ద నాస్తికుడు
దేవుడు వ్యాపారీ కాదు
పూజారి ఏజెంటూ కాదు
దేవుడు అస్పృశ్యుడు కాదు
మనిషి అంతకంటె కాదు
అయితే-ఎవడు అస్పృశ్యుడు ?
మోసగాడు-
త్రాగుబోతు-
పరుల కష్టార్జితాన్ని
పసందుగా అనుభవించేవాడు-
ఈలాంటి అస్పృశ్యుల పూజ
పూజ కాదు
ఆత్మవంచన
తన మేలుకోసం
పరులను వంచించకుంటే—అదే పూజ
గుడికి పోతే కాదు - పోకపోతే కాదు
ఒకరికోసం బ్రతికితే పూజ
స్వేదబిందువును బ్రహ్మాండంగా
దీనుణ్ణి పరమాత్మునిగా
దర్శిస్తే పూజ



# కె. వి. కామేశ్వరరావు

## చెట్టు చెప్పింది

నవోఢలా నిలిచిన
పూలచెట్టు నడిగాను-
నీలో ఇన్ని అందచందాలెందుకని
అలవోకగా నవ్వింది
ఇంతేనా నీ తెలివని
గుస గుసలాడింది—
నా తనువును చూచి
నీ మనస్సుకు దృఢత్వం అలవరుచుకో
నా పత్రాలను చూచి
నీలో వ్యక్తిత్వాన్ని సింగారించుకో
నా చివుళ్లను చూచి
నవనవోన్మేషంగా ఉండడం నేర్చుకో
నా నవ వికసిత పుష్పాలను చూసి
పసిపాపలా నిష్కల్మష హృదయంతో
మంచుబిందువులా స్ఫటిక నిర్మలత్వంతో
నవ్వడం నేర్చుకో
అంది పూలచెట్టు
జీవితసత్యాన్ని విడమరిచి చెప్పింది
పూల చెట్టు



# అనుభూతి చిత్రాలు

కవితాత్మ నావిష్కరించాలని
కలం పట్టేను
భావాల త్రొక్కిడికి
భాష తడబడేను
మాటలు పేర్చితే కవిత కాదు
కావ్యానికి
మనసు తాకే భావాలే ముఖ్యం
మరి
భావ లహరు లనంతాలు - అనల్పాలు
భాష పరిధిలో ఇముడని వ్యక్తావ్యక్తాలు
అయితే
కవితకోసం మనసుకాదు నిజం
మనసుకోసం కవిత తథ్యం
భాష చెప్పగలిగేది పరిధుల్లో అతిస్వల్పం
అత్యల్పం
మనసెరిగిన మనసుకే అది సువ్యక్తం
కవితనిండా
మనసు నింపితే
భాషచాలితే
విశ్వగీతికే అవుతుంది
విశ్వకల్యాణమే జరుగుతుంది



## పూలు-వలపులు

సుమనోజ్ఞాలు కుసుమ సౌరభాలు
సుమధురాలు మనసెరిగిన బాంధవ్యాలు
హృదయం అందమైనదైతే
రెల్లుపువ్వా
కలువభామా
ఒక్కలాగే పలుకరిస్తాయి
కుసుమానికి పరిమళమే కాదు ముఖ్యం
పూలజాతికి మనుగడే ముఖ్యం
వలపుకు కమ్మని కలలే కాదు ముఖ్యం
వాస్తవాలు స్వీకరించి
సాగిపోయినప్పుడే
నిరంతర సౌఖ్యం



## మౌనం

మనసు నిండిన వేళ
మూగనోమేను
మమత పండిన వేళ
మూగబాసేను



## బ్రతుకు బాటలో...

బ్రతుకు బాటపై
జీవిజీవికీ అన్వేషణ నిత్యం
పరమైక్యానికి
ఆత్మ ఆత్మకూ అన్వేషణ సత్యం
ఒకటి ఉదర నిమిత్తం
ఒకటి మోక్షానికి సమాయత్తం
నడియేటిలో నావకి నిత్యం
చుక్కాని పట్టే ఒడుపే ముఖ్యం
జీవనసాగరంలో నౌకకి నిత్యం
దిక్సూచిలాంటి చూపే ముఖ్యం
నిజమైన మనుగడకు ముఖ్యం
మనసెరిగిన మనసుతో సఖ్యం



## గతం-ఆగతం

గతంలోని మధుర జ్ఞాపకాల దొంతర్లు
గతించని సుమధుర భావాల తడబాట్లు
భావికి బంగారు బాటలు
భవితవ్యానికి రతనాల సౌధాలు



# గోళ్ల కుమారస్వామి నాయుడు

## క్షరం - అక్షరం

చదువు కంటే సంస్కారం గొప్పది
పదవికంటే హృదయం గొప్పది
పదవి క్షరం
హృదయం అక్షరం

## చుక్కలు

త్యాగాన్ని పండించి
స్వార్థాన్ని ఖండించి
దానవతను దండించి
చేతనాన్ని రగిలించి
మార్పు వచ్చిందేమోనని చూస్తున్న
మహనీయుల దృక్కులు - చుక్కలు
ఎంతో తపించి
మేధను మథించి
ఉత్తేజంతో వికసించి
అమృతాన్ని కురిపించే
కవి వాక్కులు - చుక్కలు
ముసురుతూన్న మసకచీకట్లలో
మినుకు మినుకుమంటున్న
వెలుగు రేఖలు యువకులు - చుక్కలు



## చుట్టూ తా ...

ఊహావాహనాన్నెక్కి
ఉపరితలంలో విహరిస్తున్నా
అంతరిక్షయానం హాయిగానే ఉంది
ప్రతిక్షణమూ పసందుగానే ఉంది
అక్కడంతా కనువిందుగానే ఉంది
ఆలోచనాలోచనాలు తెరచి
ఇలాతలాన్ని వీక్షిస్తే
చెప్పనలవికాని విషమ విషయాలు !
భయానక దృశ్యాలు అనేకాలు
అడుగడుగునా శోకాలు
విందులు చేసుకునే కాకఘూకాలు
ప్రాణాలతో చదును చేసి
రక్తంతో పదును చేసి
నాటిన పూలమొక్కను
రక్కసి చీడపురుగులు తింటూ ఉంటే
తమకేం పట్టనట్టు బతికేస్తున్న
ఆగసికులు ఈ దేశానికి వారసులు
స్వేదాన్ని రుధిరాన్ని ధారబోసి
విషాద ప్రవాహంలో
పరగడుపులతో
తృణకణాల్లా తేలుతూ మునుగుతూ
తిరుగుబాటు చేయలేక
ఎదుగుబాటు చూడలేక
వెలుగుబాట వేయలేక
మూలిగే ప్రాణుల మానని వ్రణాలు!
నల్లకోటుల కోటల్లో
వసిస్తూ హసిస్తూన్న అన్యాయాలు

తెల్లకోటుల కోటల్లో
నల్లసిరుల దరహాసాలు
అధికారం ముసుగులో
అవినీతిచేసే వింత వింత విన్యాసాలు!
రక్షకుల పేరు తగిలించుకొని
చేసే రాక్షస కృత్యాలు
కామాంధుల లజ్జాహీన నృత్యాలు
మనుపరులు చేసే మానభంగాలు
లతాంతాల విషాదాంతరంగాలు!
కలిమాయగాథలు
ఆకలి చావుల బాధలు
భూతలం నిండా కలతలే!
కన్నీళ్ళ సెలయేళ్ళే!
భజన చేతిలో సృజన
ఓడిపోయిన చిహ్నాలే
జ్వలించే అసహనపరుల సమూహాలే
రగిలే అసంతృప్తి కాష్ఠాలే



## వీళ్ళను నమ్మకు

అన్నా! వీళ్ళను నమ్మకు
నీ సుమ హృదయానికి
సునపాకు తొడిమ విలువైనా లేదు
వీళ్ళు నీ మంచికి తలవంచినారని తలంచకు
వంచకాగ్రేసరులు వీళ్లు!
నీ దగ్గర ధనం ఉంటే చుట్టూ చేరుతారు
భలేవాడి వంటారు-భజనలు చేస్తారు
తైలం కాస్తా తరగ్గానే
పురుగును చూసినట్లు చూస్తారు
నీ వెంట పదవి ఉంటే
నీ ఇంటి ముంగిట పడిగాపులు కాస్తారు
పొగడ్తల పొగడ లెక్కిస్తారు

కావలసింది సాధించుకుంటారు
కనిపించడం మానుకుంటారు
వాళ్ళు స్వార్థహృద్రోగులు-విశ్వాసద్రోహులు
అన్నా వీళ్ళను నమ్మకు !
కాగడాలు పెట్టి వెతికినా ఒక్కడయినా
కర్ణుడిలాంటివాడు కనిపించడు
పదవి దొరికేట్లుంటే, చేతులు తడి అయ్యేట్లుంటే
తల్లికైనా ద్రోహం చేసే తత్త్వం వీళ్ళది
గుళ్ళకు వెడతారు
రాళ్ళకు మొక్కుతారు
ఆహానికి బానిసలవుతారు
మానవతా మహిమను మట్టు బెట్టుతారు
తాము మట్టిలో కలుస్తామన్న మాటే మరుస్తారు
ప్రగతిని గూర్చి ప్రగల్భాలు పలికే
దగుల్బాజీలు వీళ్లు
మానవతా పారావతాన్ని మసాలా పెట్టి
వండుకుతినే మహానుభావులు వీళ్ళు
గాంధీ కపచం ధరిస్తారు
భ్రాంతిలో ముంచేస్తారు
బసకెళ్ళి బ్రాందీలో మునుగుతారు
అన్నా ' వీళ్లను నమ్మకు
అట్టడుగున ఉన్నవాళ్ళను చూసి
అట్టహాసం చేస్తారు
పట్టపగలే చట్టం కంట్లో దుమ్ముకొట్టి
దోపిడీలు చేస్తారు
నీ ప్రసూన హృదయాన్ని
నులిమి పారేస్తారు
అన్నా ! వీళ్లను నమ్మకు
నీ ఆత్మను
వాళ్లకు అమ్మకు



# కె. బి. చౌదరి

## రవి - కవి

నేనొక కవిని-భావకవిని, ప్రేమకవిని
మాటలు రాకున్నా పలుకాలనుకునే మూగ కవిని
నిష్పక్షపాతినైన ప్రాతఃకాలవు రవిని
మాటలు లేకున్నా వాని విలువ నెఱిగిన కవిని
మాటలు రాకున్నా వీలున్నంత సహాయం చేసే రవిని
ప్రకృతి కాంత ఒడిలో పరవశించే కవిని, దానికి
నిత్య నూత్న చైతన్యాన్ని ప్రసాదించే రవిని
ముల్లులోని మృదులత్వం అనుభవించిన కవిని
వలపు జల్లులచే చల్లబడిన అమాయకపు రవిని
అగ్ని గుండాలతో మండి, వెలుగు కిరణాల నందించే రవిని
మండే గుండెల నుండి వెల్వడే భావాల నర్థం చేసికోగల కవిని
పూలకూ ముల్లుకూ కారణభూతుడనైన రవిని
పువ్వులనే కోసికొనే నైపుణ్యంగల కవిని



## వస్తూంది ఉగాది

వస్తూంది వస్తూంది ఉగాది
వేస్తూంది నవ జీవనాలకు పునాది ॥వస్తూంది॥
ప్రకృతి కాంతను పరవశింప జేస్తూంది
మనలో క్రొత్త కోర్కెల జనింప జేస్తూంది

కోకిలల క్రొత్త గొంతులను వినేందుకు వీలుగా
మన చెవిలోని ధూళిని దులిపి వేస్తూంది ॥వస్తూంది॥

పచ్చడిలోని ప్రతి వస్తువునూ
తానే మూట కట్టుకొని తెస్తూంది
సుఖ దుఃఖాల కలయికే జీవితమని
మనకు నేర్పేందుకే ఉరికి వస్తూంది ॥వస్తూంది॥

మునుపటి కష్టాలన్నిటికీ టాటా చెప్పమంటుంది
భవిష్యజ్జీవనానికి పూలబాట వేయమంటుంది
తన పచ్చడినే అమృతంగా అందించి
ప్రతివాణ్ణి అమరుణ్ణి జేయాలనే ॥వస్తూంది॥

పేరులో ఏముందని అంటున్నది, మన
తీరులో తీర్పున్నది-చూడమన్నది
మనం దుర్మతులం కాకూడదని కోరుకొంటున్నది
తాను దుర్మతినే కానని ఋజువు చేయవస్తూంది ॥వస్తూంది॥



## తీరని దాహం

కలకాలం ప్రేమింపబడి
ప్రేమదాహంతో బాధపడి
ఎన్నో నియమాలకు కట్టుబడి
కొన్ని బంధాలచే చుట్టబడి
ప్రేమ స్వరూపానికి సిగ్గుపడి
పిరికివాడిలా భయపడి
ఎటూ నిర్ణయించలేక పొరబడి
మృగతృష్ణలో జలముంటుందని భ్రమపడి
ఎంతో దూరము కదువడిఁ
వెనుకకు చూడక పరుగిడి

అలసి సొలసి ఆగలేక క్రిందబడి
లేని సత్తువను పుంజుకొని
చుట్టూ చూశాను అక్కడే నిలబడి
దాహం ఇంకా తొలగలేదు నన్ను విడి
కరువై పోయింది నా నాలుకకు తడి
స్పష్టంగా కనిపిస్తూ, వెక్కిరిస్తున్న
మోసపు మృగాలపై ఉమ్మిడి
మైకంలోనుండి తేరుకొని, త్రుళ్ళిపడి
అప్పుడుగాని తెలిసిరాలేదు నా నడవడి
మెల్లగా వెనుకకు అడుగిడి
తీరనిదాహంతో వడివడి
తిరుగుతున్నాను నేనిపుడు మతిచెడి



## తొలకరి

ప్రకృతి కాంత తాపాన్ని తగ్గించేందుకు
శీతలోపచారాలకు నియుక్తమైన చెలికత్తెవై
సస్య శ్యామల సామ్రాజ్య స్థాపనకై
పునాది రాయి ప్రతిష్ఠాపనా సంరంభమై
జీవసమాధిలోకి వెళ్ళిన జీవులకు
బ్రతుకుమీద తీపి పుట్టించేందుకై
వేసవి తాపంతో తబ్బిబ్బైపోయిన పశులకు
అనావృత స్నానశాలల యేర్పాటుకై
నిద్రావస్థలో ఉన్న విత్తనాల వెన్నుతట్టి
లేపే, మహత్తర బాధ్యతా నిర్వహణకై
మధ్యతరగతి గృహస్థుడి పేరందుకు
తగియున్నదో లేదో ధృవీకరించే అధికారివై
ఎప్పుడో బెడిసిన నేల-నింగి కాపురాన్ని

నిలబెట్టేందుకు శాంతి ఒప్పందం కుదిర్చే
మధ్యవర్తివై
హరిత విప్లవానికి నాంది ప్రస్తావనా
సుముహూర్తం దాటి పోతోంది రాలేవా?
రెక్కాడితేగాని డొక్కాడని కనీస మానవుడిపై
కనికరం లేదా?
గుజ్జం ఎండుగడ్డి మేస్తున్నా దయరాదా?
మానవుడింకా కొన్నింటి కతీతుడేనని మరొక్కసారి
తెలుపాలనుకోవడం నీకు న్యాయం కాదు
ఇందులో స్వార్థపరుల చేయున్నట్లు తోస్తున్నది
ఎవరబ్బా వాళ్ళు?
పాతాలకన్నా సెలవుల మీది
మమకారాన్ని చంపుకోలేని విద్యార్థులా?
వాళ్ళ బలహీనతలను కనిపెట్టిన
స్వలాభాపేక్షా పరులైన ఉపాధ్యాయులా?
లేక
ఇక్షురస కేంద్రాల యజమానులా?
శీతల పానీయాల కర్మాగారాల
సంస్థాపకులా?
అయ్యో!
నిన్ను కూడా వదల్లేదా, ఈ మ్యామ్యా రోగం!
యుగ ధర్మాన్ని పాటిస్తున్నానని
చెబితే, నిజమే మరి,
ధర్మాన్ని ఉల్లంఘించరాదని
తెలిసికోవడమూ తప్పనిసరి
ప్రకృతి ప్రేమికుడిగా నా బాధ
బోధ పడిందనుకుంటాను
ఒ సింపక, మాకు ప్రేమపాత్రవై
జోహారు లందుకొమ్మంటాను



# అక్కిరాజు జనార్దనరావు
## జీ వి త ం

అయాచితంగా లభించినా
ఆశలనూ, ఆకాంక్షలనూ
ఆరాటాలనూ, పోరాటాలనూ
పెంచేది జీవితం
తీపి - చేదు
సుఖం - దుఃఖం
మంచి - చెడు
వినోదం - విషాదం
అభినందనలు - అభిశంసనలు
కలిమి - లేమి
వెలుగు - చీకటి
వగైరా... వగైరా ద్వంద్వాలను
కలగలుపుగా
చవిచూపేది జీవితం
కొందరికే
వడ్డించిన విస్తరి
ఎందరికో
దుఃఖభాజనం
జీవితం
జీవిత గమనం కంటకమైనా
జీవితంపై మమకారం తరగదు
బ్రతుకు మధువును
బ్రతికినన్నాళ్ళూ
జావుకోవాలని
ఆశతో
పేరాసతో
జీవితపుటంచుల వరకూ
జీవయాత్ర సాగించటానికి
కొట్టుమిట్టాడుతున్నాడు
మనిషి



## ఆ క లి

అమృతం సేవించినవారికి
అదేమిటో తెలియనిది
బొజ్జలు పెరిగిన కుబేరులను
'సనేమిరా' బాధించనిది
కడుపు 'నిండుకొన్న' కుచేలురను
అనుక్షణమూ దహించేది
ఆకలి... ఆకలి
ఆకలికి అనేక రూపాలు
డబ్బు ఆకలి
పదవి ఆకలి
కీర్తి ఆకలి
సంపాదన ఆకలి
'సెక్సు' ఆకలి
తీరని ఆకలి
పీడిస్తున్న క్షుద్బాధ
కుతంత్రాలకు ప్రోదిచేస్తే
దుస్సాహసానికి పురికొల్పితే
పతనం తథ్యం
వినాశనం ఖాయం



## అంతరాలు

అనుదినమూ
క్షణ క్షణమూ
బరువుగా, భారంగా
నిర్జీవంగా, నిస్సారంగా
బతుకులు ఈడుస్తున్న
జీవితాలు దొర్లిస్తున్న
అనామకులు, అర్భకులు
కొల్లలు, కోకొల్లలు

అగాధంలో ఆర్తనాదాలు వారు
అశక్తుని ఆవేశకావేషాలు వారు
రంగ రంగ వైభవంగా
ఠీవిగా, హుషారుగా
నిండు నిండుగా జీవిస్తున్న
అణువణువూ జీవితమాధుర్యం అనుభవిస్తున్న
పెట్టి పుట్టిన బాబులూ
వడ్డించిన విస్తళ్ళూ
అనేకులే
అసంఖ్యాకులే
అందరినీ మోస్తున్న నేల ఒక్కటే
అందరికీ ఆచ్ఛాదనగా నిలచిన నింగి ఒక్కటే
వారికీ, వీరికీ నడుమ
నింగీ - నేలల అంతరం ఎందుకు ?
వారు అనుంగు పుత్రులా?
వీరు సవతి కొడుకులా?
పూర్వజన్మ సుకృతమంటారా?
స్వయంకృతాపరాధమా?
మేధాశక్తిని బట్టి
మేటి స్థానం లభించాలి
కాయకష్టాన్ని బట్టి
అవకాశాలు దొరకాలి
ఉన్నవారు ముప్పూటలా
పంచభక్ష్య పరమాన్నాలు తింటుంటే
లేనివారు రోజుకు ఒకసారైనా
కనీసం ఎంగిలి కూడా పడవద్దా?
తరతరాల అంతరాలను
అంతం చేయటం
ఆలోచనలో కాక
ఆచరణలో జరగటం
అవసరం...అవసరం



# అ ధి కా రి

అధికారిని
నే నధికారిని
ఉన్నతాధికారిని
నా కెందుకు సమ్మెలు
అలజడులు, ఆందోళనలు
ఏడుపుగొట్టు అమ్మణి అప్పుకు వలె
ఈడేరుతాయి నా కోర్కెలు బలె బలె
పెరుగుతాయి జీతభత్యాలు
మెరుగవుతాయి సర్వీసు పరిస్థితులు
బృహస్పతులైన సబార్డినేట్లు
హన్మంతులైన సేవకులు, శకటాలు
నాకు హంగుదారులు
భుజకీర్తులు
నా హస్తాక్షరం
పత్రానికి ప్రాణం
ఈ ప్రాణదానం కోసం
సందర్శకులు అనేకం
తెరల చల్లని నీడలో ఆసనం
విడిగా విశ్రాంతి గది
నా ప్రత్యేకత
నా విశిష్టత
నేనధికారిని
ఉన్నతాధికారిని



# అయ్యదేవర పురుషోత్తమరావు

## వ య సు

ఊరికి వెలుపల తోటలోపల
వెలసిందొక అందాలమేడ
సుఖసంతోషాలకు నీడ
మేడలో కాపురం ఉన్న కుటుంబం
ఊరివారందరికీ సన్నిహితం
నిండుగుండె ఉండాలేకాని
ఊరికి వెలుపల ఉంటేనేం లోపల ఉంటేనేం?
మేడలోని దంపతులూ వారి సంతానం ముగ్గురూ
మగపిల్లలు పెద్దవాళ్లు ఆడపిల్ల ఆఖరిది
అందరికీ ఆత్మీయులు ఎందరికో నేస్తాలు
పెద్దవాడు పెండ్లీడుకు వచ్చాడు
చిన్నవాడు నూనూగు మీసాలతో తూగుతున్నాడు

ం ం ం

ఆడపడుచు అత్తింటికి చేరుకుంది
నట్టింట ఆడపిల్ల అందాల సవ్వడులు కరువైనయి
సందె దీపం తన వెలుగు కళ్ళతో
ఆడపిల్లను చూసే అవకాశం కోల్పోతున్నది
ఇల్లాలనుకొన్నది కోడలు కావాలని
పెద్దవాడికేమి తక్కువ
అందం-చందం-వయసు-మనసు
బుద్ధి-భాగ్యం-వినయం-వివేకం-అన్నీ ఉన్నయి
ఏ కన్నైనా కోరుకొనేవి

చిన్నవాడు అన్నిట్లో చిన్నవాడె
అందంమాట ఎందుకులెండి!
చందంమాట వింటేనే చచ్చినంత పనౌతుంది
నడత వంకర-మనసు వంకర-మాట వంకర
మొగము మాత్రం అన్నతో సరితూగుతుంది
అన్నకు వినయమెక్కువ
తమ్ముడికి వయసు పొంగెక్కువ
అన్నకు సంస్కారం పెద్దలది
తమ్ముడికి సహవాసం నీచులది

పెద్దవాడి చేష్టలకు తల్లి మనసు తల్లడిల్లింది
వయసు పొంగున వన్నె తరిగిన చిన్నవాడి ముఖం చూచి
కుమిలి కుమిలి ఏడ్చింది
పెళ్ళిచేస్తే కట్టుబడిపోతాడనుకుంది
పెద్దవాడికైతే కదా వీడికి పెళ్ళి ?
అతడ్ని కదిపిచూసింది
తనకు తొందరలేదన్నాడు
చదువుమీద మమకారం పెంచుకున్నాడు
ఇప్పుడప్పుడే సంసారభారం వద్దన్నాడు
తమ్ముడికి ముందు పెళ్ళి జరిగితే
తనకు సంతోషమే నన్నాడు

o o o

చిదిమిదీపం పెట్టుకునే సంబంధం వచ్చింది
కాని—ఆ పడుచు చూపులు పెద్దవాడి చూపులతో కలిసిపోయినయి
పెండ్లికి తొందరలేదన్న పెద్దకొడుకు
తాళికట్టి యింటికి తెచ్చుకున్నాడు ఆ దివ్వెను
అమ్మగుండె వెన్నెలలా విరిసింది
పద్మంలా పూచింది - కడలిలా పొంగింది
అన్నకు నచ్చిన పడుచు తమ్ముడికీ నచ్చింది
అయితే ఏం లాభం? విధి మరోదారిని చూసుకుంది

తన సొత్తును అన్నకాజేసినాడని ద్వేషం పెంచుకున్నాడు
పెండ్లాముగా రావలసిన పడుచు వదినై కూర్చున్నందుకు
తన్నుతాను మరచిపోయాడు
ఆకొన్న బెబ్బులిలా మారిపోయాడు
అతని చూపులలో కామం మనసులో క్రోధం
బ్రతుకులో ప్రతీకారం పెనవేసుకుపోయినయి
వదిన ఆప్యాయతను అర్థంచేసుకోలేక
తన అందచందాలకు మురిసిపోతున్నదని భ్రమపడ్డాడు

ం ం ం

ఒక అర్ధరాత్రివేళ
ఇంట్లో ఎవ్వరూలేరు
వదిన ఒక్కతే పడుకుని ఉంది
మరిది మనసులో అశాంతి మరీ ఎక్కువైంది
అశాంతి పెరిగినపుడు మనిషికి సుఖముండదు
అందునా శరీరసుఖానికి అర్రులుచాస్తున్న మనిషిలో
పాశవికవృత్తి విజృంభిస్తున్నది
మరది వదినను తాకినాడు —
ముచ్చెమటలతో తడసిన చేయితో
వదినె మేల్కొన్నది
మరది మదిలోని కలవరాన్ని అర్థం చేసుకున్నది
కొంగుతో అతని చమట తుడిచింది
ఆప్యాయంగా పలకరించింది
అప్పుడామె చూపుల్లో తల్లి కనిపించిం దతనికి
చేసిన తప్పును తెలిసికొన్నాడు
'వదినా!' అన్నా డతడు
'బాబూ!' అన్నది ఆమె.



# లోకం

ఇంట రంభవంటి యిల్లాలున్నా
పడుపుపడతికోసం ప్రాకులాడుతారు
కౌరవితో తలగోకికుంటారు
మొక్కులే మూలవిరాట్టుకు
ఊరేగింపుకి ఉత్సవవిగ్రహం
పేరు గురువులది స్వాహా శిష్యులది
బ్రతికుండగా కనీసం పలకరించనివారు
చచ్చింతర్వాత చిత్రపటాలు పెట్టి పూజిస్తారు
చచ్చింతర్వాత బర్రెపాడి బైటపడ్డట్లు
ఉన్న ఊరిలో ఎరగని వారెవరని
పొరుగూరిలో ఎరిగిన వారెవరని
పాపం కొత్తకోక కట్టుకోలేకపోయిందో భాగ్యశాలిని
అయినవాళ్ళను కాదని
పరాయివాళ్ళకోసం పరుగులు తీయటం
నేలవిడిచి సాముచేయటం
ఏదో వస్తుందని - ఆశతో
ఉన్నది ఊడిచిపెట్టుకోవటం
పొదుగుకోసి పాలు త్రాగటం
పదిమందికీ పనికిరానిపని
స్వర్గారోహణకు అయినా
కుక్కతోక పట్టుకుని గోదావరీదటం.



# నాగినేని భాస్కరరావు

## నేడు - రేపు

ఎవరికి వారే నాయకులైతే
ఏ పార్టీ అయితేనేం ?
ప్రజల గోచ్చూడ గొట్టడానికి
ఎవరికి వారే అందాల రాణులైతే
ఏ కొలతలుంటేనేం ?
మొగుడి జుట్టూడ గొట్టడానికి
ఎవరికి వారే శాస్త్రజ్ఞులైతే
ఏ ఫాక్టరీ ఐతేనేం ?
Foreign Know-how దిగుమతి చేసుకుందుకు
ఎవరికి వారే ఇంజనీర్లయితే
ఏ యే పాళ్ళు ఎంతుంటేనేం ?
కట్టేటప్పుడే కూలే కట్టడాలకు
ఎవరికి వారే నీతిమంతులైతే
ఏ ఆఫీసైతేనేం ?
ఫైళ్ళ రెక్కలు విరిచి సొరుగుల్లో దాచేందుకు
ఎవరికి వారే సుశిక్షితులైతే
ఏ పోలీసు స్టేషనైతేనేం ?
దోషుల్ని విడిచి, స్త్రీలను చెరిచేందుకు
ఎవరికి వారే వైద్యులైతే
ఏ (మెడికల్) షాపైతేనేం ?
వున్న రోగాన్ని పెంచుకోవడానికి
ఎవరికి వారే పాపభీతి కలవారైతే
ఏ కొట్టు అయితేనేం ?
కల్తీ సరుకును, అధిక ధరలకు కొనుక్కోవడానికి
ఎవరికి వారే మహాభక్తులైతే
దేవుడికి ఏ పేరైతేనేం ?
కానుకల పేర, పూజల పేర, అన్నదాతల పేరవచ్చింది పంచుకోవడానికి
ఎవరికి వారే ప్రచురణకర్తలైతే
ఏ పుస్తకమైతేనేం ?
కిలోల లెఖ్ఖన అమ్ముకోవడానికి

ఎవరికి వారే మహా కవులైతే
ఎవరు గద్దె నెక్కితేనేం ?
వారి లాగూలమీద, చీరలమీద భట్టాజు పొగడ్తలు వ్రాయడానికి
"ఇదిగో—నీవు మితిమీరుతున్నావ్"
ఖబడ్దార్। జాగ్రత్త ! !"
ఉన్న ఈ కళ్లతో చూసింది
ఉన్న ఈ చెవులతో విన్నది
చెప్పడానికి గుండె
చెప్పేందుకు నోరు వున్నాయి-
చెప్తున్నాన్నేనిదే— ఈ చేతుల్తో
నిన్ను రూపు మాపి
నే కలలుగనే రూపం యిచ్చి
'రేపు'ను సృష్టిస్తా.



## (The Broken Blood) పగిలిన నెత్తురు

'నెత్తురు !'
'ఖూన్'! !'
'Blood !!!' ('రక్తం!!!')
ఒకటే కలకలం
ఒకటే గుసగుసలు
'నిజమే ?'
నిజం— ఎర్రగా వుంది
నిజం—గడ్డ కట్టి వుంది
నిజం— ఎండిపోయి వుంది
నిజం— నిజం — నిజం
రక్తం! ఖూన్!! నెత్తురు!!!
రోడ్డుమీద, రోడ్డు ప్రక్క
దారిలో డొంకలో
అదే! అదే!! ఎర్రెర్రగా, ఎండిపోయి
పొలంలో, హలంమీద
అదే! అదే!! గడ్డ కట్టి, గడ్డి కరచి
రైలు పట్టాల్, రాజభవనాల్
కర్మాగారమూ, కచేరీలు

మత సంస్థలూ, మఠాలూ,

.........................

భయంతో ఎరుపెక్కి, వెర్రెక్కి -
బెదురుతో వేడెక్కి వెల్లుతున్న నెత్తురా ? కాదు
సకల దేశ శ్రమజీవుల కళ్లల్లో—
దగాపడ్డ దీనుల మేనుల్లో
మెలితిరిగి మొండికెత్తి మరుగుతూ
కసితీరక కదను త్రొక్కు లావా—
అది— నెత్తురు, నిజం
నెత్తురే-ప్రవహించింది
ప్రసవించిన విప్లవ మాతనుండి,నిజం
నెత్తురే ఎగచిమ్మింది
విప్లవ వీరుల కత్తుల నుండి
నిజం ! నిజం ! ! నిజం ! ! !
విప్లవ వీరుల అడుగు జాడల్లో
విప్లవ భావాల ఛాయల్లో
పెల్లుబికిన ప్రజావాహిని —
సమభావం, సౌభ్రాత్రం
శ్రామిక శాంతి సందేశం గుండెల నింపుకున్న
నాటి పోరాటం వీరులు—
నిస్వార్థం, నిష్కపటం, నైర్మల్యం
'నీది, నాది' లేదని - అంతా 'మనదే' నని
సమాజత్వం ఆపాదించుకుని
నడిచిన నిరాడంబర నాయకశ్రేణి -
అజ్ఞాత వాసం, కారాగారం
కొండల, కోనల కాచిన పోరాటం
అన్నీ - అన్నీ - జ్ఞాపికలు కాగా
సోదర వీరులతో వివాద, విభేదాలతో ...
విడిపోయి ... వడి తగ్గి
వృద్ధాప్యం ముంచుకొచ్చినట్లు కొంత -
మాట లేక, పాట రాక కొంత -
మాట వచ్చి, పాట వచ్చి
పరుగులెత్తి, పడిపోయి కొంత -

చీలి చీలి చితికిపోయి
భవిష్యత్తును ముక్కలు చేస్తున్నట్లు -
చైతన్యం గడ్డ గట్టినట్లు -
లావా చల్లారినట్లు -
కోట్లాది మనసుల్లో నిరాశలు నింపి
నిస్తేజమైనట్లు, నిర్జీవమైనట్లు -
పగిలిన అద్దంలో కొండవలె -
సమతాభావంలో చెలరేగిన 'అహం' వలె -
తెరలు కట్టుకుని ప్రజకు దూరమై
ముఠాలుగా వున్న కామ్రేడ్స్ !-
కర్తవ్యం విస్మరించి, కత్తులు నూరుకుంటూ
ఒకరి కంట్లో మరొకరు పొడుచుకుంటూ
ఒకరి కండని మరొకరు నరుక్కుంటూ
ఒకరి తప్పును మరొకరు తెలుక్కుంటూ
నేను గొప్పంటే నేను గొప్పని కొట్లాటల్లో గొప్పయిపోతూ
చేతల్లో వెనక్కుపోతున్న ప్రతిపక్షనేతలు !-
- వీళ్ళందరూ
చిందించిన నెత్తురు కారి కారి
పాలిపోయిన పాండురోగిలా
ఈ దేశం ఎర్రజెండాలు, -వీళ్ళందరూ
నరుక్కున్న కండలు - ఎండి ఎండి
వట్టిపోయి ఎముకలగూడులా
ఈ దేశం ప్రతిపక్షం -అయినా వీళ్ళంటే -
దేశ సంపదను పీల్చి పీల్చి
మెడ తిరుగని, నడుం వంగని
వినాయకులు - టోపీరాయుళ్ళకు - భయం! భయం!!
అందుకే అధికారం అమృతం సంపాదించి
అమరులయ్యారు టోపీరాయుళ్ళు, కాని —
ఐక్యతా ఔషధాన్ని సేవించక
జాతీయతా జలాన్ని త్రాగక, మనముందు—
ఐక్కచిక్కన ప్రతిపక్షాలు
తెల్లబడుతున్న ఎర్రజెండాలు.



# అల్లంరాజు రాధాకుమార్

## గళానికి సంకెళ్ళు

అన్యాయాన్ని ఎదిరించితే-

న్యాయం ఎక్కడుందని బెదిరించాడు-
న్యాయాన్ని చంపేస్తున్నావంటే-
పుట్టించిందెవడని మీసం మెలేశాడు-
పుట్టించిన చేతుల్తో-
చంపెయ్యడంకంటె ఘోరం
ఇంకోటి లేదంటే-
దాన్ని చంపకపోతే
నువ్వు చావవన్నాడు-
మమ్మల్ని చంపితే
నీకొచ్చేదేమిటంటే-
ప్రమోషన్-
అన్నాడు!
నీ ప్రమోషన్‌కోసం
మా కాళ్ళకి సంకెళ్లు వేయించడం
చేతుల్ని బంధించడం ద్రోహం, అంటే-
ఇదీ నా పాలసీ పొమ్మన్నాడు-
ఇదీ నీ పాలసీ అవుతే-
దీన్ని ఎదుర్కోడమే మా పాలసీ-
మేం కాకపోతే మరొకళ్లు
దీన్ని ఎదుర్కొంటూనే ఉంటాం!
మా గళాలకి సంకెళ్లు లేవు!
మా కలాలకి సంకెళ్లు లేవు!



## న్యాయం ఉరేసుకొంది

కోర్టుబయట జనం మూగారు-

అందరూ అన్ని రకాలుగా అనుకొంటున్నారు-

అలా జరగడానికి కారణాలు సవాలక్ష-

ఇంతకీ అసలు కారణం-అంతుచిక్కడం లేదు.
ఒకడన్నాడు-
తన్ని మానభంగం చేశారని ఫిర్యాదు
తీసుకొని స్టేషన్‌కి వెళ్ళిన ఆమె, మరోసారి-
అక్కడా అదీ అనుభవం పొంది
దిక్కులేక కోర్టుకెక్కితే-అక్కడ...
మరోడన్నాడు-
నాకు పనిచేసే హక్కు వుంది-
కష్టపడి సంపాదించుకొన్న డిగ్రీ వుంది-
ఇన్నాళ్ళు దాంతో నాలిగ్గీసుకోకుండా
దాచుకొన్నాను-కాబట్టి
పనిఇప్పించండి మొర్రో-
అని రోడ్లమ్మటపడి గోలపెడితే-
మళ్ళీ నోరెత్తకుండా మక్కెలిరగ తన్నారు-
అదిగో అందుకు మరోసారి అక్కడ-
అహా !
ఇలా అందరూ అంటున్నారు-
మేమూ, మేమూ ఏదో ఏడుస్తాం !
మధ్యలో మీరు రావద్దంటే-ఏలికలకు
ఉక్రోషమొచ్చి-కోర్టు తీర్పునే-
ధిక్కరించిందట- అందుకే- అక్కడ...
నాకు విలువ లేనప్పుడు- నేనెందుకు?
మీ ఏడుపేదో మీరే ఏడవండంటూ-
అక్కడే- కోర్టు గుమ్మానికే-
ఉరేసుకొంది-
న్యాయం ఉరేసుకొంది !
కోర్టు బయట జనం మూగారు-
అందరినోట్లో యిదే మాట- న్యాయం ఉరేసుకొంది !



# అగ్ని పూలు

నాడు-
నీ 'ప్రేమ' మత్తులో ముంచేసి-
యూకలిప్టస్ చెట్ల అడవుల్లో తిప్పేసి-
మెరిసే నీ కళ్ల వెలుగుల్లో-
చీకట్లను సైతం మరపించేసి-
నన్ను నేను తెలుసుకొనే లోపలే-
నన్ను ముంచేసి-
అదంతా నీవు కురిపించే 'ప్రేమ'-
అనిపించావు- మురిపించావు-
చివరికి చల్లగా జారుకొన్నావు-
నేడు-
నీ మత్తు వదలక
ఆ నాటి జ్ఞాపకాల చెదపురుగులు
నన్ను దొలిచేస్తూంటే-
నాడు-నేను నీలో రుచి చూసింది
ప్రేమామృతం కాదని,
అదంతా గరళమని-
ఆ నాటి నీ కళ్లలోని మెరుపులు-
నేడు నా గుండెల్లో అగ్నికణాలుగా మారి-
కళ్లలోంచి అగ్నిపూలను కురిపిస్తున్నాయని-
నీ వొడిలో తలవాల్చి– అదే ప్రేమ సింహాసనమని
కన్న కలలు-అది ఒక అగ్ని గుండమని ఈనాడు-
నా కళ్లు తెరిపిస్తున్నాయి-
ఎంతటివాణ్ణి, ఎంతవాణ్ణి చేశావు!
ప్రేమ గుడ్డిదన్నారు, 'పిచ్చి'దన్నారు-
అయినా-గుడ్డివాళ్ళు, పిచ్చివాళ్లు
బ్రతుకున్న యీ లోకం-

నేను ఒక (hadnicapped) అవిటివాడిగా
బ్రతుకుతున్నాను- నీ మత్తు ఒదిలే దాక !
నా కళ్లలో మండుతున్న అగ్నిపూలను
నీపై వొలకపోసి నీకు ప్రేమాభిషేకం
చెయ్యాలని-అందులో నీవు మండుతుంటే చూస్తూ-
ఇదంతా నీ చలవేనని నీకు
చెప్పాలనీ - వెదుకుతూనే ఉంటాను
నువ్వు దొరికేదాకా !



## విప్లవం - విరహం

విప్లవం, విప్లవం-అంటూ
భుజాలెగరేస్తూ-
అందరినీ ఎదిరించి,
అందరినీ వదులుకొని-
కులాంతర, మతాంతర
వివాహం చేసుకొన్నా!
విప్లవం, విప్లవం అంటూ-
అందర్నీ వదులుకున్న నన్ను-
ఒంటరిగా వదిలేసి,
మరో డబ్బున్న వాడితో లేచిపోయింది
నా పెళ్లాం !- తనూ ఓ విప్లవం సృష్టిస్తానంటూ !
ఓహో ! ఇదీ ఓ విప్లవం కాబోలు
అనుకొంటూ-
ప్రస్తుతం నేను-
విప్లవంలోని విరహాన్ని
అనుభవిస్తున్నాను !



# వి. బి. లక్ష్మి

## ప్రజామోహిని

అదిగో అక్కడెవరో పిలుస్తున్నారు
వద్దొద్దు దగ్గరికెళ్ళకు
వాళ్ళు నా లాంటి మనుషులు కాదు
పాముకోరలు, తేలుకొండి, పులిపంజా
నక్కజిత్తులు
నరనరాల్లోనూ జీర్ణించుకుపోయిన
ఆధునిక రాజకీయ భస్మాసురుడు
కనిపించేది ఒకడే అయినా
వెనుక వెయ్యింతలు భయంకరమైన
నరరూప రాక్షసులు
బడుగువాళ్ళ మాంసంతో క్రైమా చేసి
ఎముకలు కొరుక్కుంటూ
మధ్యతరగతివాళ్ళని నంజుకుని లొట్టలు వేసే
బకాసురులు
రాక్షసాంశతో పుట్టి రక్షణను భక్షించే
ఖాకాసురులు
(ఒత్తు 'ఖా' కాకి బట్టల శాఖ అనే గమనిక)
ధరలు పెంచి
ప్రజల్ని దండుకుని
బొజ్జలు పెంచుకుని
రాక్షసానందాన్ని పొందుతున్న వర్తకాసురులు
ఒకరేమిటి!
ఎటుచూసినా రాక్షసమాయె
రాక్షసులకు బుర్ర తక్కువన్న సంగతి
అందరికీ తెలిసిందే
కానీ వాళ్ళకే తెలీదనుకుంటా—
అమృత హస్తమని మురిసిపోయే వారి స్వహస్తాల్ని
భస్మాసుర హస్తాలుగా మార్చే
ప్రజామోహిని
అవకాశం కోసం ఎదురుచూస్తోంది



# స్లో పాయిజన్

అసెంబ్లీలో మంత్రుల బొమ్మలకొలువు
గల్ఫ్ దేశాలకి టన్నులకొద్దీ
కూరగాయల ఎగుమతి
నగరంలో మరో నాలుగు సినిమాహాళ్ళు
కట్నం కోసం కోడలి హత్య
అవకతవక పరీక్షా ఫలితాలు—ఐదుగురి ఆత్మహత్య
పాఠ్యపుస్తకాల కొరత
విశ్వవిద్యాలయాల మూసివేత
మధ్యప్రదేశ్‌లో మానభంగాలు
ఢిల్లీ రావణ లీలలు
ఇవి వార్తలా !
స్లో పాయిజన్ మాత్రలా !
పేపరు చదివేవాడికంటే
అమ్ముకునేవాడు నయం-
పాత నాయకులు చేసిన పనులు
కొత్త మంత్రులు చెరిపేయడమే మార్పు
సగటు సామాన్యుని బతుకులో
పరిష్కారం తెలీని మరిన్ని సమస్యల చేర్పు
పండగలేమిటని ముడుచుక్కూచుంటే
సెంటిమెంట్లు ముక్కట్టుకని ముందుకులాగితే
బోల్తాకొట్టించి, బోర్లాపడేసి
టోప్పి కట్టించి
చోద్యం చూస్తోంది వర్తమానం
అసలు ధరకి యాభై పెంచి
పెరిగిన యాభైకిచ్చే ప్రత్యేక తగింపులు
చిన్న కుటుంబం సినిమాకి వెళ్తే మాత్రమే
బొటాబొటీగా సరిపోయే ఫెస్టివల్ అడ్వాన్సు
మునగచెట్టెక్కించే వాయిదాల మోజు
అన్నింటికీ ఉందిగా అప్పుల రివాజు
ఇది కవిత్వ కల్పన కాదు
చేదునిజాల వాస్తవం
అసమర్థుల పాలనలో

అ స్తవ్యస్తాలకు అద్దంపట్టిన వర్తమానం
ఈ ఇక్కట్ల రక్కసులను రూపుమాపే
గాండీవ కోదండ త్రిశూలాలను
వేయూనే చైతన్యపు వెల్లువకు
అడ్డుకట్ట ఉండకూడదు



## ఏం చేసుకోడానికి...?

ఉగాది ఉదయం
మత్తుగా కళ్ళుతెరిచాను,
ఆమని కోయిల కుహూ...మని
పలకరిస్తుందనీ...
వసంతునితో చెట్టాపట్టా లేసుకుని
ఉషాసుందరి - స్నేహామృతధారలు
నాపై చిలికిస్తుందనీ...
ప్రకృతి నాకోసం చలువపందిళ్ళు
వేస్తుందనీ...
కోటికోర్కెలతో
క్రొంగొత్త ఊహలకు ఊపిరి పోసుకోవాలని
ఉగాది ఉదయం
మత్తుగా కళ్ళు తెరిచాను-
కంచెదిరి పోయేలా
మత్తు విరిగిపోయేలా
తల తిరిగిపోయేలా
వాస్తవానికి ప్రతిరూపంగా
భీకరంగా కోరలు చాచి
నన్ను కబళించడానికే నన్నట్టు
కట్టెదుట భయంకరంగా దుర్మతి
భీతితో పెరట్లోకి పరిగెత్తాను
మామిడికంటే వేప విరగబూసింది
జీవితంలో నాదే పై చేయన్నట్లు
నా ఊపిరి నాకే చేదువాసన వేస్తోంది

గుమ్మానికున్న మామిడి తోరణం
పత్రిక ప్రత్యేక సంచికల ముఖచిత్రాలు
వార్తాపత్రిక ప్రత్యేకానుబంధం
ఆకాశవాణి కవి సమ్మేళనం—, దుర్మతి
తెలుగు సంవత్సరాదనీ, పండగనీ,
గతంలో ఏడాదికోసారొచ్చే వసంతాన్ని
వర్తమానంలో వత్సరానికోసారి, కనీసం తల్చుకోవాలనీ
గుర్తుచేస్తున్నాయి
వీధిలో
పంచదారకోసం
కిరసనాయిలుకోసం
బార్లుతీరిన క్యూలు
కడుపులో ఆకలి రగులుతుంటే
కళ్ళల్లోకి వసంతమెలా వొస్తుందని
ప్రశ్నిస్తున్నాయి !
పెంచిన కరువుభత్యాలకు
మూడింతలుగా కరువు పెరుగుతుంటే...
ఇంటిల్లిపాదీ రెక్కలాడించినా
డొక్కలాడ్డం గగనమై పోతుంటే...
ఆశించినవన్నీ ఆకాశకుసుమాలై ...
రాజపూజ్యం కంటే అవమానం వెయ్యింతలై
వెక్కిరిస్తుంటే...
ఎందుకొచ్చిన ఉగాది !
ఏంచేసుకోడానికి ! ?
పండగ పేరున
పచారీకొట్లో
పద్దు పెరుగుతుంటే...
కట్టుకున్న బట్టల్లో సైతం
కాసులే కనబడుతుంటే..ఎందుకొచ్చిన ఉగాది? ఏంచేసుకోడానికి!
చక్రభ్రమణంలో
కష్టసుఖాలను బేరీజు వేసుకోవడంకన్నా
మహాకవిలా నాకుగాదులు లేవనుకోవడం మిన్న-



# టి. కె. విజయకుమార్

## కవితార్థత

సమాజశ్రేయస్సును కాంక్షించేది
కవిత్వం అయితే
రసాత్మకమైన వాక్యమే
కవిత్వం కానక్కర్లేదు
పద్యమైనా గద్యమైనా
పచనమైతే చాలు - పాఠకలోకానికి
ఛందస్సుల తూగులూ -
అలంకారాల చమ్కీలూ -
పద గుంభనల సింగారింపులూ
భాషా భేషజాలూ -
కవిత్వం అయితే !
అది పుష్కలంగా ఉంది
భోషాణాల నిండా !
అందులో మన సంప్రదాయమూ ఉంది
మన తాతల సంస్కారమూ ఉంది
ఆ నేతుల వాసనలూ ఉన్నాయి
ఆ విలువలు కాపాడ్డానికి
పెద్దన్నా, తిమ్మన్నా, సూరన్నా
సాహిత్యాంబరాన
ప్రబంధాలకు, ప్రబంధాలు సంతరించి
పెద్ద గద్దెనే ఏర్పాటు చేసుకున్నారు
మన సినీ ప్రపంచానికి మసాలా లందించారు.

సినిమా కళకు ప్రయోజనం
ఆనందం అయితే
అది కళాఖండం కానక్కర్లేదు-
కళను ఖండ ఖండాలుగా చేసి
కాసులవర్షం కురిపిస్తే చాలు
"శంకరాభరణాలు", ''వంశవృక్షాలూ" చాలు
మాకూ - దిగ్దర్శకులున్నారని చెప్పుకోడానికి
'అ,ఆ'ల పరిచయం చాలు
రచయితలూ, కవులూ కావడానికి
ప్రతిభా, అభ్యాసమూ ఉంటే చాలు
వ్యుత్పత్తితో పనిలేదు
జబ్బపుష్టి
కాపీచేసే కెపాసిటీ ఉంటేచాలు
పురాణాల ప్రసక్తి లేదు
కావ్యాల పరిశీలనా లేదు
సైన్సు పరిజ్ఞానం అంతకన్నా అక్కర్లేదు
అక్షరస్పర్శ తప్పించి
ఎంతమందికుంది విజ్ఞానం?
వాళ్ళకోసం రాసేటప్పుడు
కవితార్ద్రత లేమిటి ?
ఎవరైనా రాయొచ్చు
మరెం కెవరైనా చదవొచ్చు
పాఠకశ్రోతా !
నువ్వైనా చెప్తావా
ఇంతకంటె కవితార్ద్రత లేమిటో ?



# సంపూర్ణా సంపూర్ణం

కదిలిన ప్రతి భావమూ కవితే అయితే
ప్రతి వానిలో భావన లనేకం
ఉలిదెబ్బ పడిన ప్రతి రాయీ శిల్పం అయితే
ప్రకృతి అంతా కళానిలయం
చదివిన ప్రతివాడూ ఉద్యోగైతే
మనం చూసే ప్రతి యిల్లూ ఒక బడి
మనిషి మనిషికీ మానవత్వం ఉంటే
ప్రతి మనిషి ఒక దేముడు
కష్టించిన ప్రతి జీవికీ ఫలితం దక్కితే
కండలు కక్కిన స్వేద బిందువులే ఆనంద బాష్పాలు
ఉపన్యాసాలుదంచే ప్రతివాడూ నాయకుడైతే
ప్రతి ఇంట్లో ఒక నాయకుడు
విడిన ప్రతి పెదవీ నవ్వితే
జగమంతా ఆనందమయం
నోరు నవ్వి నొసలు వెక్కిరించకపోతే
మనిషీ మనసూ ఒక్కటే
ప్రతి పనీ సఫలమైతే
తీరిక గల మనిషే లేడు
మెదిలిన ప్రతి ఆలోచనా రూపు దిద్దుకుంటే
అందరి మస్తిష్కాలూ ఆలోచనల పుట్టలే
ఆదర్శాల యాగంలో
అంతరాంతరాల హవిస్సులో
ప్రతి మనిషీ ఒక సమిధ

కష్టం, సుఖం - పాపం, పుణ్యం
సవ్యం, అపసవ్యం-సుఖం, దుఃఖం
అన్నీ అసంపూర్ణాలే
అన్నీ అసందర్భాలే
అన్నీ ఆరాటాలే
అన్నీ అరచేతిలో స్వర్గాలే !
అసలు -
మనిషి వేదాంతిగా మారడానికీ
కర్మంటూ అఘోరించడానికీ
ఈ సంపూర్ణా సంపూర్ణాలే కారణాలు
ఇవి లేకుంటే లేవు కొందరి కానందాలు
పదిమందిపాటు ఒక్కరికోసం
ఆ పదిమందికోసం "ఆ" ఒక్కడూ తాపత్రయ పడడు.
ఇదీ మన సంప్రదాయం
దీన్ని కాపాడుకోడం కొందరి విధి
ఆ కొందరి విధికోసం పదిమంది నడవడి
ఇది చరిత్ర చర్వణం
అందుకే -
మానవాళిచరిత్రే
సంపూర్ణా సంపూర్ణం



# శారదకుమార్

## నాంది

నీ ఎదుటి ప్రపంచం
నీలో ఓ ఊహకు నాంది
నీలో కదిలే ఊహ
నీ భావానికి నాంది
నీ భావం
నీ శబ్దానికి నాంది
నీ శబ్దంలో కదిలే కలం
నీ కవిత్వానికి నాంది
నీ కవిత్వంలో రసం
నీ ప్రాభవానికి నాంది
నీ ఆ ప్రాభవంలో వెలిగే దీపం
తిరిగి నీ ఊహకు నాంది!



## నీ శక్తి ఎక్కడుంది?

నీకంటూ వుంటే నీవుంటావు
నీవుంటే నీ చుట్టూరా వుంది
నీ చుట్టూరా పరికించి చూడు
అనంతమయినది-
అమృతమయినది

విశ్వానికి—
ఓ నిదర్శనమయినది
శక్తి-
మహితోక్తి-
మహాదీప్తి
వికసిస్తోంది-
ప్రభవిస్తోంది-
ప్రకాశిస్తోంది
కాని......
తరాల సందట్లో-
కులాల మతాల-ఎగుడు దిగుడు మెట్లలో
తికమకయి చస్తోంది
చివరకు జీవం పోయేలా వుంది
గాజుమేడల్లో-గవాక్షాలు సైతం బంధించేసి
గాలాడకుండా దాచబడివుంది-
అది స్వేచ్ఛందమే
సర్వజీవకోటికి ప్రాణోపాయమే
అయితే-ఆ గాజుమేడల్లోంచి
వింత ప్రదర్శనం చేయటంగాదు-
గాలాడని-గమనాలులేని ఆ శక్తి
నీ చుట్టూరా వుంది-
నీకై-నీ తరానికై వుండాలంటే
ఆ గవాక్షాల్ని కదిలించాలి
గాజుమేడల ద్వారాల్ని తెరిపించాలి
అదీ-పరాయివాళ్ళ-మిఱుమిఱులు పడకుండా
నీ శత్రువుల శతఘ్నిగుండ్లకు పగులకుండా
నీ మేధస్సును
నీ ఓజస్సును నింపాలి
స్వశక్తితో మధించాలి

అపుడే-
ఆ నీ శక్తి-ఓ మహోక్తిగా
నీ చుట్టూరా
మహాదీప్తై వెలుగుతుంది



## అంధకారానికి స్వస్తి

ప్రేమ ఎచట ఉద్దీపితమో
మనసు ఎచట ప్రస్తావితమో
ప్రతి మనస్సు ప్రకోపిత శక్తుల
అధఃపతనమ్ము కాదో-
దివారాత్రములు-దివ్వెలవెలుగుల
భవితవ్యమ్మున పొంగునో—
ఎచట రజస్సు లంచులు దాటవో
ఎచట తమస్సు లసలే వుండవో
ఎచట ప్రకృతి తత్త్వ మవలోకితమో
ఎచట ధర్మ నిక్షిప్త రాసులన్నిటికి
దీప్తి కెరటాలు తొలగవో-
ఎచట మానవత మనీషితత్త్వం పెరుగునో
ఎచట మహనీయ రాగ పంక్తు లుద్భావితమో
ఎచ్చట సమశక్తి సత్యమనస్సమిధా స్రవంతులే రేగునో
ఎచట సహన సౌందర్య-సహజత్వములు
సమ భావముల దీపికలై భాసించునో
అచటే, అపుడే-నీ శక్తి
నీ ధీయుక్తికి సరియగు మహోక్తి
అంధకారానికి అసలయిన స్వస్తి-



# మెట్లు - పాట్లు

నాటిని తలుచుకుంటూ
నేటిని నడుపుకుంటూ
రేపటికై జీవిస్తున్నాడు-
ఒక తరహా మనిషి-
నాటి నాటకాలు మరిచిపోయి
నేటి రంగస్థలానికి రంగులు పూస్తూ
రేపటి సింహాసనాన్ని అధిష్ఠించాలని
పరుగులు తీస్తున్నాడు—
ఇంకో తరహా మనిషి—
నాటి అనుభవాన్ని సమన్వయించుకోలేక
నేటి పద్ధతిని మార్చుకోలేక
తృప్తిలేక రేపటి ఆశల్ని చంపుకోలేక
జీవిస్తున్నాడు-మరో తరహా మనిషి
తరహాలూ, మనుషులూ ఎవరయినా
కావాలి
లేదా తరతమాలు చూసి రేపటికి చేదోడు; తోడు
కలదు ఏ దారి కాగోడు
అందుకే కావాలి
సమ సమాజాని కందరితోడు



# మాచర్ల శ్రీనివాసరావు

## మరో ప్రపంచం

నా తలలో
ఆలోచనల అందాల రాసులు
అవి సృజిస్తాయి వేనవేల ప్రపంచాలు
అదనుచూసి
అవి వెలుపలికొస్తాయి
అప్పుడు
ఈ మట్టిచిప్ప పైడిపాత్ర అవుతుంది
ఈ ముళ్లబాటలు పూలతోట లవుతాయి
ఈ యెడారిదిబ్బల్లో
బంగారు పంటలు పండుతాయి



## ధైర్యం

లైట్లు ఆర్పేసినా
నన్ను చీకట్లు కమ్ముకోలేదు
నా కళ్లముందు
ఒక జ్యోతి ప్రకాశిస్తూనే వుంది
నన్ను నడిపిస్తూనే ఉంది !



## చైతన్య జ్వాల

నా మానస మధుశాలలో
అకల్మష రసధారలు
ప్రవహిస్తున్నాయి
నా హృదిలో
ఉవ్వెత్తుగ లేచే భావ తరంగాలు
ఉదయిస్తున్నాయి

నా కళ్ళ గోళాలలో
నిర్మల కాంతులు మెరుస్తున్నాయి
నా పరువాలలో పలుకులలో
పసిడి మువ్వల గల గలలు
ధ్వనిస్తున్నాయి
నాలో నినాదాలు
విజయ గీతాలుగా నినదిస్తున్నాయి



## బ్రతుకు

నిజం నిలదీసి
శిలవేస్తుందని
భయపడకు
అబద్ధం ఉచ్చుబిగించి
ఉరితీస్తుందని
భయపడు
నీవు-
విషం పంచకు
అమృతమే పంచు
ఎందుకంటే-
నిజం నిన్ను
నలుగురిలో నిలుపుతుంది
అబద్ధం నిన్ను
అట్టడుగున నలుపుతుంది
విషం నిన్ను-
నలుగుర్లో చంపుతుంది
అమృతం నిన్ను-
అందరిలో బ్రతికిస్తుంది
నిలవడం నేర్చుకుని
బ్రతకడం మరిచిపోకు



## "స్వాగతం"

వెలుగుకు రూపం ఉంటే
అది తెలుగు
తెలుగుకు నడత ఉంటే
అది నవత
నవతకు మమత ఉంటే
అది నేను
వెలుగు తెలుగు నవతా మమతా
నేనై -
విశ్వ హృదయం తలుపులు
బార్లా తెరిచుంచేస్తా
మిమ్మల్నందరిని సాదరంగా
ఆహ్వానిస్తా



## నే.....

బిందువునై
నిశ్చలానంద తరంగాలలో
ఇమిడిపోతాను
సింధువునే
నిస్వార్థ హృదయాలలో
ఒదిగిపోతాను
వెలుతురునై
వెన్నెలలో కలిసిపోతాను
సూర్యుణ్ణై
నింగిలో ఉండిపోతాను



## దుఃఖం

ఆకాశం చివుక్కుమన్నప్పుడు
అవకాశం చూసుకు
నేల రాలుతుంది
చిరుజల్లు



## మనిషికోసం

ఎండాకాలంలో పచ్చగడ్డిని
చలికాలంలో ఎండుగడ్డిని
నేనౌతాను
నేనెప్పుడూ
పదుగురికోసం వెలిగే
ప్రమిద నౌతాను
వెలుగుకోసం తపించే జ్వాల నౌతాను
చీకట్లు తరిమే
ఉజ్వల కాంతిమాల నౌతాను
ప్రాణాలు నిలిపే నీటిబిందువు నౌతాను
ప్రాణకోటికోసం
ప్రాణవాయువు నౌతాను
మనిషి నౌతాను



## ప్ర బో ధం

గోరీల్లో నిద్రపోతున్న శవాల్లారా
గోడల్ని కూల్చేసి
బయటకు అడుగు వేసిన
మీరు మానవులర్రా!
నరకం తిమిరంలో
నలిగిపోతున్న సన్నాసుల్లారా!
కనురెప్పల్ని బలవంతంగా
తెరుచుకు చూస్తే
స్వర్గం - తూరుపు వెలుగులు
పొడుచుకు వస్తుంది
సమర సాహసంతో లేవండి



# డా॥ తిరుమల శ్రీనివాసాచార్య

## ఎవరది ?

లతాంగిలా
రకరకాల పూలూ
రతనాలహారాలూ
అందంగా అలంకరించుకుని
మీగడ మాటలతో
వెన్నెల చూపులతో
హాసంతో విలాసంతో
లయలను హాయలను ఒలికించి
ప్రసన్న మధురంగా నా మనస్సును
రసార్ద్రం చేస్తున్నది
ఎవరది ?
సన్నని తీవలా
నున్నని చివుళ్ళతో
సిగ్గిల్లే మొగ్గలతో
పూవులతో
నెత్తావులతో
మధుర మధుర మకరందాలతో
ఉల్లాన్ని ఉర్విళ్ళూరిస్తూ
స్వర్గమాధురిని
చవి చూపిస్తున్నది
ఎవరది ?
ప్రభంజనంలా
ప్రళయాగ్నిలా
ప్రజ్వలదాగ్రహోదగ్ర ఫాలాక్షుని నేత్రశిఖిశిఖలా
ఫెళ ఫెళార్భటులతో
ప్రచండజ్వాలాశితో
పొగలతో సెగలతో
నిఖిల దౌష్ట్యాన్ని నిర్మూలిస్తూ
ధౌర్త్యాన్ని దగ్ధం చేస్తూ
మౌఢ్యాన్ని మసి చేస్తూ

నా ఎదదను గదగదలాడిస్తున్నది
ఎవరది ?

మహాత్మునిలా
ఎల్లలులేని ఉల్లంతో
అణువణువూ కదిలిస్తూ
ఆత్మలను వెలిగిస్తూ
రాతిగుండెల్లో కూడా
రసరాగాలను పలికిస్తూ
విశ్వమానవలోకానికి
వినిర్మలత్యాగపాఠాలు చెపుతున్నది
ఎవరది ?
అది ఎవరో తెలియదా !
అది—
విశ్వరూపస్ఫూర్తి
కల్యాణవర్తి
కవితామూర్తి



## గుండె గులాబి

గుండె గులాబి పూచేదెప్పుడు?
మండు టెండల్లోనూ మనిషి
వానజల్లులా
వచ్చినప్పుడు-
నరాలు కొరికే చలిలోనూ
నరుడు అగ్నిజ్వాలలా
నర్తించినప్పుడు
చందురునికి అడ్డుపడే మేఘాలను గాలి
చిందరవందర చేసినప్పుడు
కండలుపిండే చెమటకు
అందగా నిలిచినప్పుడు
కాయలుగాచిన చేతుల్లో
కలిమి చెలువ

కిలకిలా నవ్వినప్పుడు-
నగ్న శిశువులా
అగ్ని కీలలా
ప్రతి హృదయం
పలికినప్పుడు-
బీటలు వారిన నేలలన్నీ
నీటి ఊటలతో
మాటాడినప్పుడు-
బట్టలులేని చెట్లవలె ఉన్న
బడుగు వర్గాలు
నూనూగు చిగుళ్ల కలిమికి
నోచుకున్నప్పుడు



## సమరం సాగిద్దాం

మన అణువులను మధించి
అణు బాంబులనూ
నరాలను త్రుంచి
ఫిరంగులనూ
రగిలే కండలతో
మిగ్ విమానాలనూ
శలాకల్లాంటి శల్యాలతో
శతఘ్నులనూ
చిర్రెత్తే రక్తంతో
క్షిపణులనూ
మాటలతో తూటాలను
ఇలా
శరీర మంతా
శక్తిగా మార్చి

సమరం సాగిద్దాం
ఈ సమరం
ఏ దేశాలతోనో కాదు
స్వార్థపరుల ఉద్దేశాలతో
వంచకుల హృద్దేశాలతో
పదార్థాలను కల్తీ చేసే
పరమ కిరాతకులతో
కన్నెల లోవన్నెలకు పీట వేయక
కట్నాల మూటల పాటలు పాడే
కటిక పిశాచులతో
లంచాలను భోంచేస్తూ
రక్తంత్రాగే రాబందులతో
పగలే చీకటిని కల్పించే
దగాకోరులతో
ప్రజలను ఎండలో నిలబెట్టి
పార్టీల గోపురాలకు చేరే
పదవుల గొడుగుల క్రిందికి దూరే
అధములతో
కులంపేర బలం సాధించే
వర్ణం పేర సువర్ణం సంపాదించే
కుటిలురతో
కుక్షింభరులతో



సూర్యుడిలో వేడిపోతె అతడు చీకటి
చంద్రుడిలో వెలుగుపోతె అతడు చీకటి
నదులల్లో నీరుపోతె అవీ చీకటి
ప్రేమలేని నాడు మనిషి బ్రతుకు చీకటి

# సుధామ

## బుర్ర

బుర్రల్ని భద్రపరచడం బుర్ర ఉన్నవాళ్ల హాబీ
ఓ పెద్దచేప తలకాయ చిన్నచేప తలకాయల్ని
పొట్టలో దాచుకుంటుంది
ఆదివికున్న తల చిట్టడివితలల్ని
జాగ్రత్త పరుచుకుంటుంది
బుర్రల్ని దాచాలి
మట్టి ఉంటే - అది ఇంకెక్కడో ఎరువు అవుతుంది
ఖాళీ అయితే - ఇంకేదో నింపి బెలూన్లా వదలచ్చు
కుళ్లి ఉంటే - శుభ్రమైనచోట దిష్టిపిడత చేయచ్చు
ఏ బుర్రనీ వదులుకోవడం కాక
బుర్రల్ని మార్చడం మాత్రమే బుర్రపని
ప్రాణమంటూ లేనప్పుడు
ఏ మొండానికి ఏ తల అయితేనేం
అయినా
బొర్రలు తప్ప బుర్రలు కనిపించనిచోట
ఢీకొనడానికి ఏ బుర్రా ఉత్సాహించని చోట
ఏ మొండానికి ఏ తల అయితేనేం
ఏ బొర్రకు ఏ బుర్ర అయితేనేం



## వలపు

అగ్నిలా-
తియ్యగానే మొదలయింది
ఏకాంత బాధా తిమిరాల్ని దహించింది
కానీ చిత్రం !

ఎదకు సెగ నంటించి
ఇంకా చిచ్చులానే అనిపిస్తోంది
నీటిలా—
ఆనందంగానే ఊరింది కంటి బావిలో
ఒంటరితనం పిడుచకట్టిన
బ్రతుకునాలిక దాహాన్ని తీర్చింది
కానీ చిత్రం
ఎదలో వరదలా పొంగుతూ
విరహజలధియై నిలిచినట్లనిపిస్తోంది
గాలిలా—
ఆహ్లాదంగా మలయానిలంగానే వీచింది
మత్తెక్కించింది
కానీ చిత్రం
సుడి తిరిగి - బ్రతుకు
తుఫాను బీభత్సమనిపిస్తోంది.
కలంలా—
కాంతా సమ్మితంగానే కదిలింది
కలల్ని అక్షరాల్లో పొదువుకుంది
ఇక చిత్రమేమిటిగానీ
కాలంతో మేల్కొని, కలలు రగుల్కొని
కలకాలం కష్టజీవి వెన్నెముకగా మారింది
అగ్నిని, నీటిని, గాలిని
అన్నిటినీ కూడగట్టుకుని
నిటారుగా నడిచింది
ధాత్రిని కౌగిలించింది



# గు రి కో స ం

పాపం గొర్రె
దాని తోకలాంటి దాని జీవితం
నాలుగు పాదాలతో నడవడమే ధర్మం అనుకుంది
నడుస్తోంది
నాకూ నాలుగు కాళ్లున్నాయనే కుక్క
ఏదో! ఇంటికి కాపలా ఉంటుందిలే అని
ఎవరో పెంపకం సింహాసనం ఎక్కిస్తే
ఆ అదును చూసుకుని
అధికారం పిచ్చెక్కి ఒకటే ఉరకలు
గొర్రె కాలు పట్టుకుని విరిచి
బరబరా ఈడ్చుకొచ్చింది
చూడండి నా సాహసం అని
చెవులాడించింది, తోక ఊపింది, కళ్ళు తిప్పింది
ఈ గొర్రెలకు తోకలు పొడుగని
కసిక్కున కత్తిరించింది కాట్లతో
లటుక్కున కాలు దొరకపుచ్చుకొని
పుటుక్కున విరిచిపారేస్తా
పాలు నా పాలుచేయండని
ప్రతాపగర్జన చేస్తోంది
భౌ భౌ భౌ మని
పెంపుడుదే అయినా
పిచ్చికుక్క హానికరం
మేము ఊరుకోలేము
ఊరి చివర గురి చూసుకోడానికి
మా బండి
పిచ్చికుక్కల్ని వెంటాడుతుంది

## ఔట్ లుక్

'మార్పు రావలసిందే'
అందరూ అరిచారు
'మాకూ సమ్మతమే'
ఏలినవారి తల ఊపుడు
చైతన్యం చెంగలించి
వెలుగు వెల్లువ ప్రవహించి
మార్పుకు ప్రజ అంతా
దీక్షతో చేతులెత్తితే
ఏలినవారు
వారి చేతుల్లోని చైతన్యశక్తిని కాక
చంకలోని వెంట్రుకలు చూస్తున్నారు



## డియర్ కుక్ !

**మనిషి**

డియర్ కుక్ !
నీ ఆశయాల పెనం మీద
నీ జీవితాచరణల రొట్టె
ఏదయినా మాడిపోతే
విసిగి-ఆగ్రహించి
పెనం పారేయకు
రొట్టెలెన్నయినా కాలనీ
మాడిన వాటిని నువ్వే దిగమ్రింగి
రుచివంతమైన వాటిని
నలుగురికీ చూపించు
పంచు



## గురికోసం

పాపం గొర్రె
దాని తోకలాంటి దాని జీవితం
నాలుగు పాదాలతో నడవడమే ధర్మం అనుకుంది
నడుస్తోంది
నాకూ నాలుగు కాళ్లున్నాయనే కుక్క
ఏదో! ఇంటికి కాపలా ఉంటుందిలే అని
ఎవరో పెంపకం సింహాసనం ఎక్కిస్తే
ఆ అదును చూసుకుని
అధికారం పిచ్చెక్కి ఒకటే ఉరకలు
గొర్రె కాలు పట్టుకుని విరిచి
బరబరా ఈడ్చుకొచ్చింది
చూడండి నా సాహసం అని
చెవులాడించింది, తోక ఊపింది, కళ్ళు తిప్పింది
ఈ గొర్రెలకు తోకలు పొడుగని
కసిక్కున కత్తిరించింది కాట్లతో
లటుక్కున కాలు దొరకపుచ్చుకొని
పుటుక్కున విరిచిపారేస్తా
పాలు నా పాలుచేయండని
ప్రతాపగర్జన చేస్తోంది
భౌ భౌ భౌ మని
పెంపుడుదే అయినా
పిచ్చికుక్క హాసికరం
మేము ఊరుకోలేము
ఊరి చివర గురి చూసుకోడానికి
మా బండి
పిచ్చికుక్కల్ని వెంటాడుతుంది




తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పొరాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3